# తెలంగాణాలో జాతీయోద్యమాలు

డా॥ దేవులపల్లి రామానుజరావు

పల్లి రామానుజరావుగారి
అభినందన సమితి
హైదరాబాదు-500001

మన జాతీయోద్యమాలు ౧

# తెలంగాణలో జాతీయోద్యమాలు

డా॥ దేవులపల్లి రామానుజరావు

ప్రచురణ :

డా॥ దేవులపల్లి రామానుజరావుగారి
అభినందన సమితి
ఆంధ్ర సారస్వతపరిషత్తు - హైదరాబాదు.

# తొలి పలుకు

భారత దేశము నందలి తక్కిన రాష్ట్రములలో వలెనే హైదరాబాదు రాజ్యములోను స్వాతంత్ర్యోద్యమాలు, విప్లవోద్యమాలు తలఎత్తి కొనసాగినవి. తెలంగాణములో పై ఉద్యమాలతోబాటు సాంస్కృతికోద్యమముగూడ సమర్థవంతముగా సాగింపబడి, అఖిలాంధ్రదేశము ఒక్క ఛత్రముక్రింద చేరుటకు అనువగు వాతావరణమును సృష్టించినది. ఈ ఉద్యమమును గూర్చి శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారు సుందరమైన సమీక్షను చేసినారు.

శ్రీ రామానుజరావు గారు ఉత్తమ సాహిత్య సేవకులుగ ఆంధ్ర లోకమునకు సుపరిచితులు. వారు తెలంగాణమున వివిధ రంగములలో, పాతికేండ్లనుండి చేయుచున్న సేవ స్మరణీయమైనది. విషయమును సూటిగా, సుందరముగ చెప్పుట వారికి వెన్నతో అబ్బిన విద్య.

ఈ చిన్న పుస్తకములో మూడు ముఖ్య ఘట్టములు వివరింపబడినవి. మొదటిది హైదరాబాదు రాష్ట్రములో సాగిన విప్లవోద్యమాలు, స్వాతంత్ర్యోద్యమాలు; రెండవది తెలంగాణాలో సాగింపబడిన రాజకీయ, సాంస్కృతికోద్యమాలు; మూడవది ఆంధ్రజాతి ఏకీకరణకు మూలమైన విశాలాంధ్రోద్యమము. శ్రీ రామానుజరావు గారికి తెలంగాణా ఆంధ్రోద్యమముతో పరోక్ష సంబంధము, సాంస్కృతికోద్యమము, విశాలాంధ్రోద్యమాలతో ప్రత్యక్ష సంబం

ధము కలదు. కావున వారి రచన ప్రామాణికమైనదనుటలో సందేహము లేదు.

మొదటి ఘట్టము విశేష పరిశ్రమ చేసి ఎక్కడెక్కడనో పడియున్న చారిత్రక పత్రముల కవిలెకట్టలను గాలించి సేకరించిన ఆధారాలతో వ్రాసినట్టిది. భారత జాతీయ మహాసభ అవతరించుటకు ముందే దక్కనులో 19 వ శతాబ్దారంభము నుండి బ్రిటిషు ప్రభుత్వముపై వ్యతిరేకోద్యమాలు బయలుదేరినవి. హైదరాబాదు రాష్ట్రములోని ప్రజలు, జాగీర్దారులు, మౌల్వీలు, సైనికులు, పత్రికాధిపతులు విడివిడిగా సాగించిన ప్రతిఘటనోద్యమాలు దైవ ప్రాతికూల్యముచే విఫలమైనను భారత స్వాతంత్ర్య సమర చరిత్రలో ఈ రాష్ట్రముగూడ సముచితపాత్రను నిర్వహించియుండెనను పరమసత్యమును చాటుచున్నవి.

వంగ, మహారాష్ట్రములలో వలెనే ఇచ్చటను విప్లవోద్యమాలు బయలుదేరి బ్రిటిష్ పాలకులను, వారి తొత్తులగు నవాబులను కల్లోలపరచినవి. నైజాం నిరంకుశ పాలన రాష్ట్రములోని బహుసంఖ్యాక ప్రజల భాషలను అణగ ద్రొక్కినది. రాజాదరణము గల ఉర్దూ భాషలో వెలువబడిన కొన్ని పత్రికలు ప్రభుత్వ పైశాచిక పాలనా పద్ధతులను తీవ్రముగ నిరసించినవి. తెలుగు వారికి తెలియని ఈ పరమ సత్యాలను గ్రంథకర్త వివరించినారు.

మాతృభాషకు జరుగుచున్న అపకారమును సహించలేని తెలుగు వారిచే తెలంగాణములో ఆంధ్రోద్యమము ఆరంభింపబడినది. ఇది రాను రాను రాజకీయ, సాంస్కృతిక రూపములు ధరించి, రెండు

పాయలైనది. ఆ పాయల వివిధ గతులును ఇందు రమణీయముగ వర్ణింపబడినవి. మూడవ ఘట్టము - విశాలాంధ్రోద్యమము. ఇది ఆంధ్రదేశ చరిత్రలో ప్రధానమైనది. ఆంధ్రుల చిరకాలవాంఛిత మగు ఆంధ్రరాష్ట్ర మేర్పడినను అది సమగ్రతను పొందుటకు తెలంగాణా సంపూర్ణ సహకారము కావలసి యుండెను. ఆ సమయమున గ్రంథకర్త స్వయముగ నడుము బిగించి విశాలాంధ్రోద్యమ నౌకకు కర్ణధారులై విజయము సాధించుటకు తీవ్ర కృషి చేసియుండిరి ఇంగ్లీషువారి రాజ్యవిస్తరణ కాంక్షకు గురియై, ముక్కలైన ఆంధ్రభూమిని ఏకఖండ మొనరించుటకు తీవ్ర ప్రజోద్యమ మవసరమై యుండెను. ముక్కోటి ఆంధ్రుల ఐక్యతకు కారణమైన ఈ ఉద్యమము ఎట్లు తెలంగాణమున ఉద్భవించి, ఏ ప్రతిబంధకాలను అధిగమించి, ఏ యే దశలను పొంది ఫల సిద్ధిని గాంచెనో, ఆ సమగ్ర స్వరూపమును ప్రత్యక్ష సంబంధము గల గ్రంథకర్త కనులకు గట్టినట్లు చిత్రించినారు. ఉత్తమ చరిత్ర కారునివలె శ్రీ రామానుజరావు గారు సరళ శైలిలో సత్యాంశము లను వివరించినారు కాయమున చిన్నదైనను విషయగౌరవముచే ఉన్నతమైన ఈ రచన ఆంధ్రలోకమునకు ఆదరణీయము కాగల దని విశ్వసించుచున్నాను.

గడియారం రామకృష్ణశర్మ

15-9-'64

# ముందు మాట

గత యాభై సంవత్సరాలుగా తెలుగు భాషకు, తెలుగు సంస్కృతికి డా॥ దేవులపల్లి రామానుజరావుగారు చేస్తున్న సేవ యావదాంధ్ర దేశానికి సుపరిచితమైనదే. ఆనాడు నిజాం పరిపాలనలో తెలంగాణంలో తెలుగు భాషకు జరుగుతున్న అన్యాయాన్ని సహింపక ఉద్యమశీలురై శ్రీ రామానుజరావుగారు ఎన్నో ఉద్యమాలను నడిపి తెలంగాణంలో తెలుగుభాషా సంస్కృతులకు ఎంతగానో దోహదం చేసినారు. వారు నడిపిన ఉద్యమాలన్నింటికీ ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రధాన కేంద్రంగా ఉండింది. సారస్వత పరిషత్తుకు వారు కార్యదర్శులుగా, ఉపాధ్యక్షులుగా, ప్రస్తుతం అధ్యక్షులుగా ఉండి ఆ సంస్థను ఎంతో అభివృద్ధిలోనికి తీసుకొని వచ్చినారు. ఆంధ్ర రాష్ట్రంలోనే ఇంత చక్కని సాహిత్య సంస్థ మరొకటి లేదంటే అతిశయోక్తి కాదు. దీనికంతకూ డా॥ దేవులపల్లి రామానుజరావుగారి నిస్స్వార్థసేవ, అకుంఠితదీక్ష, తెలుగుభాషా సంస్కృతులపై గల అభిమానం కారణమని చెప్పవలసి ఉంటుంది. సాహిత్యరంగంలోనేకాక విద్యారంగంలోనూ వారిసేవలు విశిష్టమైనవి. హైదరాబాదులో ఉన్న ఒక్క సాంకేతిక విశ్వవిద్యాలయం తప్ప తక్కిన అన్ని విశ్వవిద్యాలయాల్లోనూ వారు సిండికేట్ సభ్యులుగా ఉండి మంచి విద్యావేత్తలుగా పేరు గడించినారు. దాదాపు 25 సంవత్సరాలుగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి కార్యదర్శులుగా ఉండి తెలుగు సాహిత్యాభివృద్ధికి ఎంతో దోహదం చేసినారు.

తెలుగుభాషకు శ్రీ రామానుజరావుగారు చేసిన సేవలను గుర్తిస్తూ వారికి ఇటీవల ఆం. ప్ర. సార్వత్రిక విశ్వవిద్యాలయం వారు గౌరవ డాక్టరేట్ పట్టాన్ని సమర్పించడం అందరికీ ఆనందాన్ని కలిగించింది. ఈ శుభ సందర్భాన వారిని సన్మానించడం సముచితంగా ఉంటుందని భావించి వారి మిత్రులు, సన్నిహితులు కలిసి ఆచార్య సి. నారాయణరెడ్డి గారి అధ్యక్షతన ఒక అభినందన సమితిని ఏర్పాటు చేయడం జరిగింది. ఈ సమితి పక్షాన వారి జీవిత విశేషాలను, వివిధ రంగాలలో వారు చేసిన సేవలను ప్రతిఫలించే విధంగా ఒక విశేష సంచికను, వారు రచించిన

ఒక గ్రంథాన్ని ముద్రించవలెనని నిర్ణయించింది. వారు రచించిన గ్రంథాలు ఎన్నో ఉన్నాయి. ఐతే ఎన్నో సాహిత్య సాంస్కృతికోద్యమా లలో పాల్గొని గొప్ప ఉద్యమశీలిగా పేరు పొందిన డా॥ రామానుజరావు గారి గ్రంథాలలో 'తెలంగాణలో జాతీయోద్యమాలు' అన్న గ్రంథాన్ని ముద్రించడం సముచితంగా ఉంటుందని భావించి అభినందన సమితి ఈ గ్రంథాన్ని ప్రచురించి తెలుగు పాఠకలోకానికి సమర్పిస్తుంది

ఈ గ్రంథంలో డా॥ రామానుజరావుగారు హైదరాబాదు రాష్ట్రంలో సాగిన విప్లవ, స్వాతంత్ర్యోద్యమాలను గురించి, తెలంగాణంలోని రాజ కీయ, సాహిత్య, సాంస్కృతికోద్యమాలను గురించి, విశాలాంధ్రోద్యమాన్ని గురించి తమ సహజ సుందరమైనశైలిలో చక్కగా వివరించారు. ప్రతి తెలుగువాడూ తెలుసుకోదగ్గ ఎన్నో చారిత్రక, సాంస్కృతిక అంశాలతో కూడిన ఈ గ్రంథాన్ని అభినందన సమితి పక్షాన ప్రచురించడానికి అను మతించిన డా॥ దేవులపల్లి రామానుజరావుగారికి అభినందన సమితి పక్షాన కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము.

అభినందన సమితి చేపట్టిన కార్యక్రమాలలో మాకు అన్నివిధాలా తమ సహకారాన్ని అందిస్తున్న శ్రీ పాండురంగయ్యగారికి, శ్రీ హరికిషన్ రావుగారికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ముద్రణకు సహకరించిన సహృదయులకు, ముఖ పత్రాన్ని తీర్చిదిద్దిన శ్రీ శీలా వీర్రాజుగారికి, ఉదార హృదయంతో గ్రంథాన్ని ముద్రించి సహకరించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ శ్రీనివాస్‌గారికి కృతజ్ఞతలు.

**డా॥ ఆర్. శ్రీహరి**

**డా॥ ఎల్లూరి శివారెడ్డి**

కార్యదర్శులు

**డా॥ దేవులపల్లి రామానుజరావుగారి**

**అభినందన సమితి**

# హైద్రాబాదు ప్రజల స్వాతంత్ర్యోద్యమము



**ఇంగ్లీషువారికి నైజాం లొంగుబాటు**

క్రీస్తుశకము 1800 ప్రాంతమున భారతదేశములో ఇంగ్లీషు సామ్రాజ్యము స్థిరత్వము పొందినదని చెప్పవచ్చును. 1800 సంవత్సరమున అప్పటి గవర్నర్ జనరల్ స్వదేశీ సంస్థానాధీశ్వరులతో చేసుకొనిన ఒడంబడిక ప్రకారము నైజాం బ్రిటిష్‌వారికి సామంతుడయ్యెను. భారత దేశములో బ్రిటిష్‌వారి పరిపాలనను స్వదేశ సంస్థానాధీశ్వరులు శిరసా వహించినప్పటికిని ప్రజలలో వారి యెడల సానుభూతి లేకపోవుటయే కాక వారిని తొలగించవలెనను తీవ్రమైన ఆకాంక్ష ప్రబలియుండెనని మన దేశములోని స్వాతంత్ర్యోద్యమము స్పష్టీకరించుచున్నది. ప్రజల ఆమోదము బ్రిటిషువారికి ఎన్నడును లభించియుండలేదు.

**ప్రజల తిరుగుబాటు**

ముఖ్యముగా బ్రిటిష్‌వారిని తొలగించుటకై మన దేశమునందలి అన్ని రాష్ట్రాలలో విప్లవ ఉద్యమాలు బయలుదేరిన సత్యము చాలా ప్రధానమైనవి. ఈ విప్లవోద్యమాల చరిత్ర రక్తాంకితమై, మహోజ్వలమై, దేశభక్తి ప్రపూరితమై, త్యాగశోభితమై, ఉదాత్తమై విలసిల్లుచున్నది. అన్ని రాష్ట్రాలలో వలెనే నాటి హైద్రాబాదు రాష్ట్రములో బ్రిటిషు పరిపాలనకు వ్యతిరేకముగా విప్లవాలు బయలుదేరినవి.

**ప్రతిఘటించిన మొట్టమొదటి సంఘటన**

1803 వ సంవత్సరమున ఇంగ్లీషు వారికిని, మహారాష్ట్రులకును యుద్ధము జరిగినది. నైజాం ఇంగ్లీషు వారికి సామంతుడై యుండెను.

అప్పుడు మహిపత్‌రాయ్ అను ప్రముఖుడు నైజాం ఏలుబడి క్రింద బీరారు రాష్ట్రమునకు గవర్నర్‌గా నుండెను ఇప్పటికిని ఈయన వంశమువారు హైద్రాబాదులో ప్రముఖులై యున్నారు అప్పటి నైజాం మహారాష్ట్రులకు వ్యతిరేకముగా ఇంగ్లీషువారి పక్షమున వెళ్ళి పోరాడవలసినదని రాజా మహిపత్‌రాయ్‌ను ఆజ్ఞాపించెను. కాని ఆయన ఉద్దేశపూర్వకముగా సహాకరించలేదు. దానిమీద నైజాంకు, ఆయన ప్రధానులకు మహిపత్‌రాయ్‌పైన ఆగ్రహము కలిగినది. అప్పుడు నైజాంకు మీర్ ఆలం ప్రధానమంత్రిగా నుండెను. ఇంగ్లీషు రెసిడెంటు మరియు నైజాం ప్రధాని మీర్ఆలం ఉభయులు మహిపత్‌రాయ్ నడవడికి కోపించి, మహిపత్‌రాయ్‌ను 1804లో ఉద్యోగము నుండి తొలగించిరి అప్పుడు ఆయన షోలాపూర్ వెళ్ళి తిరుగుబాటు గావించెను అందుచేత మహిపత్‌రాయ్‌ను అణచివేయుటకై 1808 వ సంవత్సరమున నైజాం సైన్యాలు పంపబడెను కాని యీ సైన్యాలను మహిపత్‌రాయ్ ఓడించి తరిమివేసెను తరువాత ఇంగ్లీషువారి సైన్యాలు వెళ్ళి మహిపత్‌రాయ్‌ను ఓడించెను. ఈ ఓటమి ఫలితముగా మహిపత్‌రాయ్ ఇందూరు సంస్థానాధిపతి హోల్కారును ఆశ్రయించు నిమిత్తము పలాయనుడై వెళ్ళెను. మార్గమధ్యమున మిక్కిలి దీన పరిస్థితిలో మహిపత్‌రాయ్ మరణించెను. ఇది హైద్రాబాద్ రాష్ట్రములో ఇంగ్లీషు పరిపాలనను ప్రతిఘటించిన మొట్టమొదటి సంఘటన.

### భేదోపాయము

1808 వ సంవత్సరమున బొలారంలోని బ్రిటిష్ సైన్యాలను ఇంగ్లీషు వారికి వ్యతిరేకముగా తమవైపు త్రిప్పుకొనుటకు కొందరు హైద్రాబాదు జాగీర్దారులు ప్రయత్నించిరి. అందుకు వారు హైద్రాబాదు ప్రభుత్వముచేత శిక్షింపబడిరి. ఇట్లు శిక్షింపబడిన వారిలో నూరుల్-ఉమ్రా, రావు రంభా నింబాల్కర్ అను ఇరువురు జాగీర్దారులు ముఖ్యులు.

ఈ ఉభయులను తమ జాగీరు గ్రామానికి వెళ్ళి అక్కడ నుండి కదల వద్దని అప్పటి ప్రభుత్వము ఆజ్ఞాపించెను.

### రోహిలాల సాహసము

1817 వ సంవత్సరమున మూడవ మహారాష్ట్ర యుద్ధము జరిగి నది ఇది భారతదేశ చరిత్రలో చెప్పదగిన యుద్ధము. ఈ యుద్ధములో బ్రిటిషు వారికి సహాయముగా పోరాడవలసినదని నైజాం ఆదేశింపబడెను. అందుచేత నైజాం సైన్యాలు యుద్ధానికి పంపబడెను. కాని నైజాం సైన్యములోని కొందరు రోహిలాలు మహారాష్ట్రులకు వ్యతిరేకముగా పోరా డుటకు నిరాకరించిరి. అప్పుడు వారు ఉద్యోగాల నుండి నైజాంచేత తొలగింపబడిరి ఆ విధముగా తొలగింపబడిన రోహిలాలకు సర్దార్ ఖాన్ కోటేజాయి అను ముఖ్యుడు నాయకత్వము వహించి, పూనాకు వెళ్ళి పేష్వాలతో కలిసి, బ్రిటిషు వారికి వ్యతిరేకముగా పోరాడుచు యుద్ధ రంగమున మరణించెను. ఆయన మరణానికి హైద్రాబాదు నగరములోని ముషీరాబాదు, చెంచల్‌గూడా ప్రాంతంలోని ప్రతి రోహిలా కుటుంబము శోకించినట్లు ఆధారములు కలవు.

### విఫలయత్నము - కర్నూలు పతనము

1839వ సంవత్సరమున ఉత్తర భారతమున వహాబీ ఉద్యమము ప్రారంభమయ్యెను. ఇది బ్రిటిషు పరిపాలనకు వ్యతిరేకముగా ప్రారంభింప బడిన ఉద్యమము. ఈ ఉద్యమ నాయకులలో ఒకరైన మౌల్వీ సలీం హైద్రాబాదు నగరానికి వచ్చి, ఇక్కడ బ్రిటిషువారికి వ్యతిరేకముగా ఒక విప్లవోద్యమము సాగించెను. అప్పుడు హైద్రాబాదుకు నిజాంగా నుండిన నాసిరుద్దౌలాను సింహాసనము నుండి దింపివేసి, ఆయన సోదరుడైన ముబారిజుద్దౌలాకు రాజ్యము అప్పగించి, బొలారంలోని సైన్యమును తమ

ఆధీనము చేసుకొనవలెనని ఈ విప్లవకారులు ఉద్దేశించిరి. ఇందుకొరకై వారు కర్నూలు నవాబుతో గూడ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిరి. కర్నూలు నవాబు ఒక లక్షరూపాయిల ఆయుధ సామగ్రిని సేకరించి పెట్టెను బ్రిటీషు పరిపాలనకు ఎదురుతిరిగి బ్రిటీషు వారిని హత్యచేయుటకు ఈ విప్లవకారులు ఏర్పాటు చేసుకొనిరి కాని యీ ఏర్పాటు రహస్యాలు బయల్పడి, ముబారిజుద్దౌలాతోపాటు ఆయన అనుయాయులు నిర్బంధింపబడిరి కర్నూలు నవాబుతో యీ సందర్భమున రెండు రోజులు యుద్ధము కూడ జరిగినది. యుద్ధములో కర్నూలు నవాబు ఓడింపబడి, కర్నూలు నగరము స్వాధీనము చేసుకోబడెను అప్పుడు కర్నూలు నవాబుగా నుండిన గులాం రసూల్‌ఖాన్, యుద్ధములో ఓడింపబడిన తరువాత మద్రాసు పంపివేయబడగా, మార్గ మధ్యమున హత్య గావింపబడెను. హైద్రాబాదు ప్రభుత్వము ఇంగ్లీషు మరియు నైజాం అధికారులతో కూడిన ఒక కమీషన్ నెలకొల్పి, ముబారిజ ద్దౌలా మరియు ఆయన అనుయాయుల నేరమును విచారణ గావించెను ఈ విచారణ ఫలితముగా మౌల్వీ సలీం మరియు ఆయన అనుచరులకు 8 సంవత్సరాల కఠినశిక్ష విధింపబడెను. రాజ వంశీయుడైన ముబారిజుద్దౌలా గోలకొండలో బంధింపబడెను. ఆయన యీ బంధనములోనే 1854 సంవత్సరమున మరణించెను.

## '1857' ప్రభావము-తీవ్రమైన సంచలనము

1855వ సంవత్సరమున ఔరంగాబాదులోని అరబ్బులు తిరుగుబాటు లేవదీసిరి ఈ తిరుగుబాటులో బ్రిటీష్‌వారు ప్రాణాలను కోలుపోయిరి. చాలా కష్టముమీద ఈ తిరుగుబాటు అణచివేయబడెను. 1857 వ సంవత్సరమున ఉత్తరదేశములో ప్రజలు తిరుగుబాటు చేసిరను వార్త తెలియగానే హైద్రాబాదులో కూడా తీవ్రమైన అలజడి చెలరేగెను. ఔరంగాబాదు లోని దేశీయ సైన్యము ఎదురు తిరిగెను. తరువాత యీ సైన్యము

అణచివేయబడి, తొమ్మిదిమందికి ఉరిశిక్ష వేయబడెను. ఇంతలో కొంత మంది దేశీయ సైనికులు ఔరంగాబాదు సైన్యమునుండి తప్పించుకొని హైద్రాబాదుకు వచ్చిరి. అప్పుడు హైద్రాబాదుకు దివానుగా (ప్రధాన మంత్రి) నుండిన మొదటి సాలార్జంగ్ వీరిని బంధించి, ఇంగ్లీషువారి ప్రతినిధియైన రెసిడెంటుకు అప్పగించెను. హైద్రాబాదు పట్టణములోకూడ 1857 సంవత్సరమున తీవ్రమైన అలజడి చెలరేగెను. ఇంగ్లీషు వారిపైన తిరుగుబాటు చేయవలసినదని ప్రజలను కోరుచు కరపత్రాలు పంచిపెట్ట బడెను కాగితాలు గోడలమీద అంటివేయబడెను అప్పటి దివాన్ సాలార్జంగ్ గట్టి రక్షణయేర్పాటులుగావించెను. కాని 1857వ సంవత్సరము 17 వ జూలైనాడు బేగంబజారులోని నూర్లకొద్ది రోహిలాలు తుర్రెబాజ్ ఖాన్, మౌల్వీ అల్లావుద్దీన్ అను దేశభక్తుల నాయకత్వమున రెసిడెంటు మీద దాడి చేసిరి. అప్పుడు సుమారు రెండుగంటలసేపు కాల్పులు జరిగినవి ఇరువదియైదు మంది చనిపోయిన తరువాత రోహిలాలు తిరోగమించిరి. తుర్రెబాజ్ ఖాన్ అరెస్టు చేయబడెను. తప్పించుకొనిపోవు ప్రయత్నం చేయగా ఆయనను పోలీసులు తూపురాన్ గ్రామము వద్ద కాల్చి చంపిరి. మౌల్వీ అల్లావుద్దీన్ కూడ అరెస్టు చేయబడి, అండమాన్ దీవులకు యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షమీద పంపబడెను అక్కడ ఆయన 1884 వ సంవత్సరమున మరణించెను రాష్ట్రములోని ఇతర ప్రాంతాలలో కూడ అలజడులు చెలరేగెను. రాయెరాయాన్ సంస్థానోద్యోగియైన సోనాజి పంత్ 1857 జనవరి నెలలో ఉత్తర దేశములోని నానాసాహెబ్ పేష్వా కొక లేఖ వ్రాసెను అందులో దక్షిణ దేశములో తిరుగుబాటుకు తగిన యేర్పాటులు చేయవలెనని కోరెను.

### నానాసాహెబ్ నాయకత్వము

బీదర్ జిల్లాలోని నర్ఖేడ్ అను గ్రామము పట్వారీయైన రంగారావు ద్వారా యీ లేఖ నానాసాహెబ్‌కు పంపబడెను. అప్పుడు నానాసాహెబ్

కాన్పూరు సమీపమునందలి బేతూరలో నుండెను. అక్కడ ఆయన యీ ఉత్తరము అందుకొని తిరిగి అదే రంగారావు ద్వారా హైదరాబాదులోని ముఖ్యులైన సోనాజిపంత్, గులాబ్‌ఖాన్ (రోహిలాముఖ్యుడు), సఫ్దరుద్దౌలా (రావు రంబా నింబాల్కర్ ఆశ్రితుడు) మొదలైనవారికి ఉత్తరాలు వ్రాసెను. రంగారావు దక్కన్‌కు తిరిగివచ్చి నాందేడుజిల్లా దేగ్లూరు తాలూకాలోని కౌలాస్‌రాజా అయిన రాజా దీప్‌సింగ్‌ను కలుసుకొనెను. సఫ్దరుద్దౌలా కూడ నానాసాహెబ్‌తో సహకరించగలనని వాగ్దానము చేయుచు జాబు వ్రాసెను. రాజా దీప్‌సింగ్ 800 సైనికులను సిద్ధము చేసుకొని, బ్రిటిష్‌వారిని హతమార్చి నాగపూరుకు వెళ్ళవలెనని నిశ్చయించుకొనెను. అయితే ఈ ప్రయత్నాలు తెలుసుకోబడి రాజా దీప్ సింగ్, సఫ్దరుద్దౌలా. రంగారావులు అరెస్టు చేయబడిరి. సోనాజి 1857 ఫిబ్రవరి నెలలో మరణించెను మిగతవారు విచారణ చేయబడిరి. రాజా దీప్‌సింగ్ జాగీరును ప్రభుత్వము స్వాధీనము చేసుకొని, ఆయనను మూడు సంవత్సరాలు నిర్బంధించెను సఫ్దరుద్దౌలా స్థిరచరాస్తులు జప్తీ చేయబడి, ఆయనకు యావజ్జీవ నిర్బంధశిక్ష విధింపబడెను రంగారావు ప్రత్యేకముగా బ్రిటిష్‌వారిచే ట్రిబ్యూనల్‌తో విచారణ చేయబడి, మరణశిక్షకు గురిచేయబడెను.

### సంకుల సమరము

1858 లో పైఠాపూరుకు చెందిన గోవిందరావు దేశపాండే ఔరంగాబాదులో 2000 భిల్లులతో కూడిన సైన్యము సమకూర్చుకొని, బ్రిటిషువారిపై తిరుగుబాటు చేసెను క్యాప్టెన్ పెడ్లర్ న్యాయకత్వమున ఇంగ్లీషు సైన్యానికి ఈ భిల్లు సైన్యానికి మధ్య సంకుల సమరం జరిగెను. ఈ యుద్ధములో 40 మంది భిల్లులు మరణించిరి చాలమంది నిర్బంధింపబడిరి. గోవిందరావు పరిస్థితి ఏమైనదో తెలుపు వివరాలు దొరకలేదు.

నానాసాహెబ్ పేష్వా సేనానాయకుడైన తాంతియాతోపె రోహిలా సైన్యముతో అజంతా పట్టణములో ప్రవేశించి, పట్టణమును స్వాధీనము చేసుకొని, కొన్ని రోజులు తన స్వాధీనములో నుంచుకొనెను. తరువాత ఘోర యుద్ధము జరిగి, బ్రిటీషు సైన్యముచే ఓడింపబడెను. రోహిలాలు అనేకులు బస్మత్ తాలూకాకు వెళ్ళిపోయిరి ఫర్భనీజిల్లా బస్మత్ తాలూకా లోని బౌలా జాగీర్దార్ అయిన పీర్జాదా ఈ రోహిలాలను కలుసుకొనెను. అప్పుడు వారందరు బ్రిటీషువారితో పోరాడిరి. చాలామంది ఇంగ్లీషువారు యీ యుద్ధములో హతమార్చబడిన తరువాత, ఈ సైన్యము అణచివేయ బడి, రోహిలాలు నామావశేషులు గావించబడి, జాగీర్దారు పీర్జాదా బంధింప బడి, యావజ్జీవ నిర్బంధశిక్ష అనుభవించెను 1858 సంవత్సరము ఫిబ్రవరి నెలలో గుల్బర్గా జిల్లాలోని షోలాపూర్ రాజు అయిన వేంకటప్ప నాయక్ బ్రిటీషువారి మీద తిరుగుబాటు చేసెను. తీవ్ర సంఘర్షణ తరు వాత ఆయన ఓడింపబడి, నిర్బంధింపబడి, మద్రాస్‌కు పంపివేయబడు చుండగా మార్గమధ్యమున హైదరాబాదు పట్టణ సమీపమునందు అంబర్‌పేట వద్ద ఆయన ఆయన ఆత్మహత్య గావించుకొనెను.

### వీరుడు భీమ్‌రావ్

1858 జూన్ నెలలో రాయచూర్‌లో భీమ్‌రావు దేశాయి అను వీరుడు ఒక సైన్యము సమకూర్చుకొని, కొప్పల్ కోటను స్వాధీనము చేసు కొనెను. తరువాత ఇంగ్లీషు సైన్యాలు వచ్చి ఆయనమీద దాడి చేసెను. యుద్ధములో భీమ్‌రావు దేశాయితోపాటు నూటయేబది మంది సైనికులు మరణించిరి మిగిలినవారు నిర్బంధింపబడి మరణశిక్షకు గురియైరి.

### రహస్య కార్యకలాపాలు

ఆ రోజులలో నానాసాహెబ్ పేష్వా, తాంతియాతో పేలవార్తాహరులు గూఢచారులు చాలమంది హైద్రాబాదు రాష్ట్రములో సంచరించిరి. ఇంతకు

ముందు రంగారావు పట్వారినిగూర్చి ప్రస్తావించినాను ఇంకొక బ్రాహ్మణుడు తాంతియాతోపే వద్దనుండి షోలాపూర్ రాజాకు సందేశము తీసికొనిపోవుచుండగా, గుర్తింపబడి నిర్బంధింపబడి మరణశిక్ష పాలయ్యెను. నానాసాహెబ్ పేష్వా బంధువైన రావుసాహెబ్ సైన్యమును సమకూర్చుకొనుటకు దక్కన్‌కు వచ్చెను. నిర్మల జాగీర్దార్ అయిన వెంకట్రావుకు ఆయన కొన్నాళ్ళు అతిథిగా నుండెను. తరువాత ఆయన హైద్రాబాదు వచ్చెను. కాని ఒక ఇంగ్లీషు సైనికుడు ఆయనను వెంటాడగా తప్పించుకొనిపోయెను. తరువాత యీ రావు సాహెబ్ పేష్వా ఆగ్రావద్ద నిర్బంధింపబడి, మరణశిక్షకు గురియయ్యెను. రావుసాహెబ్ పేష్వాకు అతిథ్యమిచ్చిన నేరమునకై, వేంకట్రావు జాగీరును ప్రభుత్వము స్వాధీనము చేసికొనెను.

## రాంజీ గోండు

ఆదిలాబాదు జిల్లాలోని గోండులుకూడ ఇంగ్లీషువారికి ఎదురుతిరిగిరి వారి నాయకుడు రాంజీ గోండు ఉట్నూరు తాలూకాలో గోండులకు ఇంగ్లీషువారికి మధ్య యుద్ధము జరిగి గోండులు పరాజితులైరి. రాంజీ గోండు నిర్బంధితుడై నిర్మల్‌కు తీసికొనిరాబడి, అక్కడ ఒక చెట్టుకు ఉరి వేయబడి చంపబడెను ఈనాటికిని ఆ చెట్టు నిర్మలలో నున్నది. దానిని రాంజీ గోండు చెట్టు అని చెప్పెదరు.

## గడీ కైవసము

1848 సంవత్సరమున ఇంగ్లీషువారు సతారా సంస్థానమును స్వాధీనము గావించుకొనిరి తరువాత 1858-1867 సంవత్సరాలమధ్య చాల మంది సతారాప్రజలు హైద్రాబాదుకు వచ్చి ఔరంగాబాదు, బీదర్, బీడ్ జిల్లాలలో అలజడులను చెలరేగజేసిరి. 1867 సంవత్సరములో జంగ్

బహద్దర్ అను పేరుగల రాంరావు అను యోధుడు కొన్ని నూర్లమందితో కూడిన సైన్యమును సిద్ధము చేసుకొని, ఆష్టీవద్ద గల గడీని స్వాధీనము చేసుకొని తన జండాను ప్రతిష్ఠించెను తిరిగి సతారా జిల్లాను బ్రిటిష్ వారి నుండి తీసికొని స్వాధీనము చేసికొనుట తన ఉద్దేశమని ఆయన వెల్లడి చేసెను తరువాత 1867 లో రాంరావు నిర్బంధింపబడి, అండమాను దీవులకు పంపబడి, యావజ్జీవ ద్వీపాంతరశిక్ష విధింపబడెను. ఈ వివరాల వలన కొన్ని సంగతులు స్పష్టమగుచున్నవి.

1. అన్ని జిల్లాలలో స్వాతంత్ర్యోద్యమము వ్యాప్తిజెంది అభివృద్ధి చెందెను. ఇంగ్లీషు ప్రభుత్వమునకు వ్యతిరేకముగా తిరుగుబాటులు చెలరేగినవి

2 నూర్లమంది చంపబడిరి.

3. వేలకొద్ది జనులు నిర్బంధములో నుంచబడిరి.

4 దజన్ల వీరులు అండమాన్ దీవులకు పంపబడిరి.

5. లక్షల రూపాయల ఆస్తి జప్తు చేసుకొనబడెను

## కట్టుదిట్టాలు కుప్ప కూలిపోయినవి

ఇందువలన సాలార్జంగు చేసిన యేర్పాటుల ఫలితముగా హైద్రాబాదులో యెటువంటి అల్లరులు చెలరేగలేదను సంగతి సత్యము కాదని స్పష్టమగుచున్నది. 1857 సంవత్సరము తరువాత నైజాం రాజభవనపు ప్రాంగణములో అప్పుడు ఇంగ్లండు ప్రభుత్వ ప్రతినిధిగా నుండిన రెసిడెంట్ డేవిడ్‌సన్‌ను హత్య చేయుటకు ప్రయత్నము జరిగియుండెను 1860 వ సంవత్సరము తరువాత ఇంగ్లీషు వారిని పారద్రోలుటకు మరి కొన్ని ప్రయత్నాలు జరిగినవి మహబూబ్‌నగరం జిల్లాలో పండుగ శాయన్న అను యోధుడు తెల్లదొరను చంపాలె అను నినాదము లేవదీసి

తిరుగుబాటు చేసియుండెను. తరువాత యితనికి మరణశిక్ష విధించుట జరిగినది.

### చారిత్రక సత్యము

నర్మదానదికి దక్షిణాన మన దేశములో 1857 వ సంవత్సరమున యెటువంటి అలజడులు చెలరేగక పరిస్థితి ప్రశాంతముగ నుండెనని కొందరు చెప్పుచుందురు. కాని ఇది సరికాదు. 1857 వ సంవత్సరముననే కాక అంతకుముందు కూడ ఈ ప్రాంతమున స్వాతంత్ర్యోద్యమాలు విజృంభించి యుండెను. చరిత్ర ఈ సత్యమును ఋజువు చేయుచున్నది. 1800 నుండి 1857 వరకు ఈ ప్రాంతమున పరదేశ పరిపాలనకు వ్యతిరేకముగ ఎన్నియో తిరుగుబాట్లు జరిగియుండెను. ఈ ఘట్టము మన స్వాతంత్ర్య సమరదశ యొక్క మొదటిదశ; రెండవదశ 1857 నుండి ప్రారంభమై 1885 న ముగిసినది.

### ఎవరికిని తీసిపోలేదు

1857 నుండి 1859 వరకు రెండు సంవత్సరాలు పూర్తిగా హైదరాబాదు నాయకులు తాంత్యాతోపేతో సన్నిహిత సంబంధాలు కలిగి యుండిరి. ఈ కాలమున విదేశ పరిపాలనను తుదముట్టించుటకు జరిగిన మహాప్రయత్నాలలో అసంఖ్యాకులు పాల్గొనియుండిరి. ఎన్నియో నూర్ల మంది చెరసాలలో నిర్బంధింపబడిరి. లక్షల రూపాయల విలువగల ఆస్తి జప్తి చేయబడియుండెను. ఈ విధముగా 1857 నాటి స్వాతంత్ర్య సంగ్రామమున హైదరాబాదు సంస్థాన ప్రజలు తమ వంతును పూర్తిగా పంచుకొనియుండిరి. ఇతర రాష్ట్రాల వారికి ఈ విషయమున ఈ ప్రాంత ప్రజలు ఏమాత్రమును తీసిపోలేదు. చిత్రమేమనగా, 1857 వ సంవత్సరమున ఇంగ్లీషు వారికి పరమ విశ్వాస పాత్రుడుగా నుండిన సాలార్జంగ్,

తిరువాత కొన్ని సంవత్సరాలకే ఇంగ్లీషువారి అయిష్టతకు పాత్రుడయ్యెను. బీరార్ సమస్యామైన సాలార్‌జంగ్ ఇంగ్లీషు వారి క్రోధమునకు గురి అయ్యెను. ఆనాడు లార్డ్ లిట్టన్ సాలార్‌జంగ్‌ను గూర్చి వ్రాయుచు, ఈయన వలన బ్రిటిష్ సామ్రాజ్యమునకు ప్రమాదము కలదని పేర్కొనుట ఇందుకు నిదర్శనము.

### మేధావుల దోహదము

1857 లో జరిగిన స్వాతంత్ర్య సంగ్రామము దేశీయులలో కొంత మంది ప్రతిబంధముగా నిలవకుండినచో మన దేశ చరిత్రనే మార్చివేసెడిదని నిస్సందేహముగా చెప్పవచ్చును. ముఖ్యముగా ఆనాడు హైదరాబాదు ప్రధాన మంత్రిగా నుండిన సాలార్జంగ్ ఇంగ్లీషు వారికి అండగా నిలిచి, స్వాతంత్ర్యోద్యమాలను అణచడానికి తోడ్పడి, మన దేశ చరిత్రలో తన కీర్తిని శాశ్వతముగా కళంకము చేసికొనినాడు. సాలార్జంగ్ ఒక వైపున బ్రిటిష్ వారిని బలపరచుచుండగా ప్రజలు వారికి వ్యతిరేకముగా పనిచేసిన సత్యము గమనించ దగియున్నది. ముఖ్యముగా పత్రికా సంపాదకులు ప్రజలలో చైతన్యము కలిగించుటకు విశేషముగా కృషి కావించి యుండిరి. స్వాతంత్ర్యోద్యమము యొక్క రెండవ దశయందు పొరుగు రాష్ట్రాల నుండి వచ్చిన మేధావులు స్థానిక స్వాతంత్ర్యోద్యమాలకు మంచి దోహదము కావించినారు. వీరిలో బెంగాలు నుండి వచ్చిన అఘోరనాథ చటోపాధ్యాయ, మద్రాసు నుండి వచ్చిన ముల్లా అబ్దుల్ ఖయూమ్, రామచంద్ర పిళ్ళె, ఢిల్లీ నుంచి వచ్చిన సయ్యద్ అఖిల్ అను పత్రికా రచయిత, ఇటావా నుండి వచ్చిన మొహిబ్ హుసేన్ యీ స్వాతంత్ర్యోద్యమాలలో పాల్గొని యుండిరి. 1879 లో జమాలుద్దీన్ ఆఫ్ఘన్ అను ఆసియా సమైక్యవాది హైదరాబాదుకు వచ్చి, ఇక్కడి వారిలో మధ్యప్రాచ్య రాజకీయాలయందు అభిరుచి కల్గించినాడు. తత్ఫలితముగా ఇక్కడివారిలో మధ్యప్రాచ్యమున ఇంగ్లీషువారు అనుసరించుచున్న విధానాల పట్ల అసంతృప్తి ఏర్పడినది

హైద్రాబాదు సంస్థాన ప్రభుత్వము ఇంగ్లీషువారి దేశీయ విదేశీయ విధానాలను బలపర్చుచుండగా హైదరాబాదు ప్రజలు వారి దేశీయ విదేశీయ విధానాలను నిరసించిరి. పత్రికలు తీవ్ర విమర్శలు గావించినవి 1883 వ సంవత్సరమున అఘోరనాథ చటోపాధ్యాయ అరెస్టు జరిగినది. ఈ అరెస్టు చట్టబద్ధమైన ఆందోళనకు మార్గదర్శకమైనది. 1885 లో భారత జాతీయ కాంగ్రెసు స్థాపన జరిగినది. జాతీయ కాంగ్రెస్ స్థాపనను ప్రభుత్వ ప్రతినిధులుగా మొహసినుల్ ముల్క్ మొదలగువారు వ్యతిరేకించగా ప్రజాప్రతినిధులైన అఘోరనాథ చటోపాధ్యాయ,ముల్లా అబ్దుల్ ఖయామ్, మొహిబ్ హుసేను,రామచంద్ర పిళ్లై మొదలగువారు హర్షించిరి 1883 కు ముందు అనగా అఘోరనాథ చటోపాధ్యాయ అరెస్టుకు ముందు వచ్చిన ఉద్యమములన్నియును హింసాత్మకమైనవి. 1883 నుండి చట్టబద్ధమైన ఆందోళనాయుగము ప్రారంభమగుచున్నది. కావునచే 1857 నుండి 1883 వరకు గల కాలమును మనము రెండవ దశగా స్వీకరించవచ్చును.

### నైజాం ప్రాంతాల అప్పగింత-పొరుగువారితో సంబంధాలు

1853 వ సంవత్సరమున అనగా 1857 కు నాలుగు సంవత్సరాలకు ముందు ఈస్టు ఇండియా కంపెనీకి నైజాంకు మధ్య ఒక ఒడంబడిక జరిగినవి. ఈ ఒడంబడికవలన నైజాం కంటింజెంట్‌మీద ఇంగ్లీషు వారు చేసిన ఖర్చులకు బదులుగా బీరార్, ఉస్మానాబాదు, రాయచూర్ జిల్లాలను ఇంగ్లీషువారికి ప్రత్యేకించుట జరిగినది. ఇది హైదరాబాదులోని అన్ని తరగతుల ప్రజలకు అసంతృప్తిని కలిగించినది. అసలు 1800 సంవత్సరమునుండియే ఇంగ్లీషు వ్యతిరేకభావాలు హైదరాబాదు ప్రజలలో ప్రబలముగా నుండెను హైదరాబాదుప్రజలకు దేశములోని ఇతరప్రాంతాల ప్రజలతో సన్నిహితసంబంధాలు ఉండెను. హైదరాబాదు నగరానికి వివిధ రాష్ట్రాల ప్రజల రాకపోకలు చురుకుగా జరుగుచుండెను. అరబ్బులు అధిక

సంఖ్యాకులుగా వచ్చి నైజాము ప్రభుత్వ ఉద్యోగాలలో చేరిరి. రోహిలాలు, ఆఫ్ఘన్‌లు కూడా దక్కనుకు ఎక్కువ సంఖ్యలో వచ్చుచుండిరి. పంజాబు నుండి సిక్కులను చాలా మందిని రాజా చందులాల్ పిలిపించియుండెను. ఈవిధముగా ఇతర రాష్ట్రాల స్వాతంత్ర్యోద్యమాలతో హైదరాబాదు ప్రజలు గట్టి సంబంధాలు కలిగియుండిరి ఇటువంటి పరిస్థితిలో సాలార్జంగ్ హైదరాబాదు ప్రధాని అయ్యెను.

## ప్రజల విజృంభణ

1857 వ సంవత్సరమున ఉత్తరదేశములో చెలరేగిన స్వాతంత్ర్యోద్యమాల వార్తలు హైదరాబాదుకు చాల తొందరగా చేరుచుండెను. హైదరాబాదులో అప్పటివరకే ప్రబలముగా నుండిన ఇంగ్లీషు వ్యతిరేక భావాలు మరింత విజృంభించినవి. 17 వ జూలై 1857 నాడు మిట్ట మధ్యాహ్నము అయిదువేల ప్రజలు హైదరాబాదు రెసిడెన్సీమీద దాడి గావించిరి. వీరికి తుర్రెబాజ్‌ఖాన్ అను వీరుడు నాయకత్వము వహించెను. ఇంగ్లీషు సైనికులు ఎక్కువ క్రమశిక్షణ కలిగి యున్నందువలనను, ఎక్కువ నిశితమైన ఆయుధాలు కలిగి యున్నందుననను యీ దాడి విఫల మయ్యెను. ఇంగ్లీషువారి ఆయుధాలకు గురియై యీ దాడి జరిపినవారిలో చాలమంది మరణించిరి. ఈ దాడిలో మతవిభేదాలను పాటించక హిందువులు, ముస్లిములు పాల్గొనియుండిరి. ఇది మన దేశచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన వీరగాథ.

## మౌల్వీల ప్రోత్సాహము

విద్వాంసులైన మౌల్వీలు కొందరు ఆనాడు యీ ఉద్యమాలను ప్రోత్సహించి వీరికి నాయకత్వము వహించిరి. వీరిలో మౌల్వీ అల్లాఉద్దీన్ ప్రముఖుడు. ఆయన మక్కా మసీదులో మాట్లాడుచు, ఇంగ్లీషువారిని బల

పరచినవారు, ఇంగ్లీషు ప్రభుత్వము నిలుచుటకు సహాయము చేసినవారు ఇస్లామ్ మతమునకు శత్రువులనియు, ఇస్లామ్ ద్రోహులుగా పరిగణింప బడగలరనియు ఉద్ఘాటించెను. మోల్వీలతోపాటు జాగీర్దార్లు మొదలగు ఉన్నత వంశీయులు కూడ యీ ఉద్యమాలను బలపరచిరి. వీరిలో షంసుల్ ఉమ్రా కొడుకు ఇఫ్తిఖారుల్ ముల్కును పేర్కొనవలసి యున్నది ఈ విధముగా జాగీర్దార్లు మొదలైన ఉన్నత శ్రేణివారు రాజకీయమయిన మార్పును కోరిరి. ప్రజల ఉద్యమాలకు కొందరు జాగీర్దారుల బలము లభించియుండెను. వీరిని అదుపులో పెట్టుట ఆనాటి మంత్రికిగాని నైజాం దర్బారుకుగాని సాధ్యముకాని పనియని కర్నల్ డేవిడ్‌సన్ వ్రాసినాడు. 1857 నాటి స్వాతంత్ర్యోద్యమాలకు నాయకత్వము వహించిన తుర్రెబాజ్‌ఖాన్ ఏదో విధముగా తప్పించుకొనిపోయెను మౌల్వీ అల్లా ఉద్దీన్ ద్వీపాంతరవాస శిక్షమీద అండమాన్ దీవులకు పంపబడెను

## ఆంగ్లేయ సేనాని అపజయం-వెంకటప్పనాయక్ తొందరపాటు

షోలాపూర్ లోని రాజా వెంకటప్పనాయక్ ఆనాటి స్వాతంత్ర్య యోధులలో మరొక ముఖ్యుడు. రాజకీయ స్వాతంత్ర్యము ఆయన ఆశయమైయుండెను. పెద్ద సైన్యమును సమీకరించి ఉండెను. ఇది ఇంగ్లీషు వారికి అనుమానము కలుగజేసినది ఈ సైన్యమును అణచివేయుటకు 1858 వ సంవత్సరమున ఇంగ్లీషువారు తమ బలమును పంపగా, కర్నల్ న్యూబెరి ఇంగ్లీషు సేనానాయకుడు రోహిలాలతో సంఘర్షణయందు షోలాపూర్‌వద్ద చంపబడెను. తరువాత రాజా వెంకటప్పనాయక్ తొందర పడి హైదరాబాదు చేరెను. హైదరాబాద్‌లో ఆయనను ఇంగ్లీషు రెసిడెంటుకు పట్టి యిచ్చుట జరిగినది. ఈయన విచారణ చేయబడి యావజ్జీవ శిక్షకు గురిచేయబడెను. కొన్ని సంవత్సరాలు నిర్బంధములో నుండి ఈయన తుపాకితో ఆత్మహత్య చేసుకొనెను వెంకటప్పనాయక్ విచారణ

వంక మిరాజ్, కొల్హాపూర్, సర్గుంద్, కొబ్బల్, రాయచూర్, షోలాపూర్ లలో విప్లవోద్యమాలు చెలరేగినట్లు వెల్లడి యగుచున్నది

### వీరమరణము

భీమ్‌రావ్ దేశాయి అను యోధుడు కొబ్బల్ దుర్గమును స్వాధీనము గావించుకొని, దానిని తన బలమునకు కేంద్రముగా చేసికొనెను. ఇంగ్లీషు వారు ఈ దుర్గమును స్వాధీనము చేసుకొనుటకై దాడి చేసిరి. అప్పుడు జరిగిన యుద్ధములో భీమరావ్ దేశాయి మరియు ఆతని కుడిభుజమైన పెంచన్ గౌడ్ వీరమరణము పొందిరి ఆ కాలమున తాతియాతోపే పేరు ఇంగ్లీషువారికి సింహస్వప్నముగా నుండెను. తాతియాతోపె వార్తాహరులు చాలా మంది హైదరాబాదుకు వచ్చుచుండిరి. గులామ్ హుసేన్ అను బస్మత్‌నగర్ జాగీర్దార్ ఆనాటి యోధులలో పేర్కొనదగినవాడు. రాజా రాయ్‌రాయాన్ జాగీరులో దఫ్తర్‌గా నుండిన సోనాజీ పండిత్ 1857 ఫిబ్రవరి నెలలో నానాసాహెద్ పేష్వాకు రంగారావు పాగె ద్వారా ఒక ఉత్తరమును పంపియుండెను. ఈ విధముగా దేశమంతటను స్వాతంత్ర్య భావాలు తీవ్రముగా ప్రబలియుండెను.

### దర్బారు ఈవల జహంగీర్‌ఖాన్ ధైర్యము

1850 వ సంవత్సరము మార్చి నెల 15 వ తేది నాడు హైదరాబాదులో నైజాం ఒక దర్బారు చేసెను. అప్పుడే కలకత్తానుండి తిరిగివచ్చిన రెసిడెంటు గవర్నర్ జనరల్ ముఖ్యసందేశమును నైజాంకు అందజేసెను. తరువాత రెసిడెంటు ప్రధానమంత్రి చేతిలో చేయి వేసుకొని ఈవలకు వచ్చుచుండగా జహంగీర్‌ఖాన్ అనువాడు రెసిడెంటును హత్యచేయుటకు ప్రయత్నించెను. ఆ ప్రయత్నము విఫలమయినది ఈ విధముగా ఆ రోజులలో వివిధ ప్రాంతాలయందు స్థానిక నాయకులు బయలుదేరి యా

ఉద్యమాలకు నాయకత్వము వహించిరి. ఈ రెండవపక్షలో అనగా 1857 నుండి 83 వరకు సాలార్జంగే హైదరాబాదు ప్రధానమంత్రిగా నుండెను. ఆ కాలమున అనేక ఉదుగడుగున రాజకీయ ఆందోళనములను ఎదుర్కొని అణచివేయవలసి వచ్చెను. 1867 వ సంవత్సరమున సాలార్జంగ్ కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టెను. కాని ఆ సంస్కరణలు ప్రజలను సంతృప్తిపరచలేదని వేరుగా చెప్పవలసిన పనిలేదు.

**వాసుదేవ బలవంత్ ఉదంతం**

1879 వ సంవత్సరమున బ్రిటిష్‌వారికి ఎదురు తిరిగిన పూనాలోని మహారాష్ట్ర నాయకుడగు వాసుదేవ బలవంత ఫడ్కే, గుల్బర్గా జిల్లాలోని సరిహద్దు గ్రామాలలో కొంతకాలము రక్షణ పొందియుంచెను గంగాపూర్‌లోని దత్తాత్రేయ దేవాలయములోకూడ ఈయన కొంతకాలము నివసించియుండెను. ఇందుకొరకై అక్కడి బ్రాహ్మణ పూజారులు అరెస్టు చేయబడిరి. కాని వాసుదేవ బలవంత్ అక్కడ దొరకలేదు. తరువాత ఆయన బీజాపూర్ జిల్లాలోని దేవన్‌గిరిలో పట్టుబడినాడు. ఆయన విచారణ వలన హైదరాబాదులోని ఇస్మాయిల్‌ఖాన్‌తో పాటు ఇతర రోహిలాలు ఆయనకు సహాయము చేయుటకు వాగ్దానము చేసిరనియు, ఇంగ్లీషువారికి వ్యతిరేకముగా పెద్ద సైన్యమును సమీకరించుటకు నిశ్చయించిరనియు తెలియుచున్నది. ఇంచుమించుగా ఇదేకాలమున హైదరాబాదు రాష్ట్రపు తూర్పు సరిహద్దులో గోదావరిజిల్లా యందలి చోడవరము ప్రాంతమందలి రంప గ్రామములో ఒక పెద్ద తిరుగుబాటు జరిగెను. ఇదే సమయమున భద్రాచలము తాలూకాలోని రేకపల్లెలో మరొక తిరుగుబాటు జరిగెను. ఈ రెండు తిరుగుబాట్లు 1880 సెప్టెంబరులో అణచివేయబడెను. రంప, రేకపల్లె గ్రామాలు హైదరాబాదు సరిహద్దున నుండుటవలన ఖమ్మం జిల్లాలోని కొన్ని తాలూకాలపై వీని ప్రభావము బాగుగా పడినది. మధిర

తాలూకాలోని కాకపల్లె ప్రాంతమున, పాల్వంచదగ్గరి ఒడ్డిగూడెము ప్రాంతమున, ఇతర ప్రాంతాలయందును సంఘర్షణలు జరిగినవి. ఇటువంటి సంఘర్షణలు 1888 వరకు రాష్ట్రమందలి వివిధ ప్రాంతాలలో ఎన్నియో జరిగినవి. 1883 లో సాలార్‌జంగ్ చనిపోయినాడు. ఆయన మరణానంతరము రాజా నరేంద్రబహద్దూర్, లాయఖలీఖాన్ అను వారికి రాష్ట్ర పరిపాలన బాధ్యత అప్పగించబడినది ఆ కాలమున హైదరాబాదు నుండి వాడీ వరకు ఒక రైల్వే లైను ఉండెను ఈ రైల్వే లైనును ఒక ఇంగ్లీషు కంపెనీకి అప్పగించి, యీ లైనును వరంగల్లువరకు, అక్కడి నుండి ఒకవైపున భద్రాచలము, బెజవాడవరకు ఇంకొకవైపున చాందా వరకు పొడిగించుటకు ఒక ప్రణాళిక సిద్ధము చేయబడినది.

### చటోపాధ్యాయ బహిష్కరణము

ఈ ప్రణాళిక సాలార్జంగ్ కాలముననే ఆమోదించబడెను. ఈ ప్రణాళికవల్ల రాష్ట్రమునకు ఆర్థిక నష్టము కలుగునని భావించి విద్యావంతులు కొందరు ఇందుకు వ్యతిరేకముగా పోరాడుటకు ఒక కమిటీని ఏర్పరిచిరి. ఈ కార్యక్రమానికి డాక్టర్ అఘోరనాథ ఛటోపాధ్యాయ, ముల్లా అబ్దుల్ ఖయ్యూమ్‌లు నాయకత్వం వహించిరి. తత్ఫలితముగా అఘోరనాథ ఛటోపాధ్యాయ ఉద్యోగమునుండి తొలగింపబడి హైదరాబాదునుండి పంపివేయబడెను.

### విద్యావ్యాప్తి - వైజ్ఞానిక చైతన్యము

1885వ సంవత్సరము వరకు హైదరాబాదులో విద్యావ్యాప్తికి కొన్ని సదుపాయాలు ఏర్పడి, ప్రజలలో చైతన్యము కలగజేయగలిగిన ఒక ఉన్నత విద్యావంతుల శ్రేణి అవతరించినది. దారుల్ ఉలూమ్, సిటీ

హైస్కూల్, చాదర్ఘాట్ హైస్కూల్, మదర్సే ఆలియా, మదర్సే ఐజా మొదలయిన ప్రభుత్వ పాఠశాలలతో పాటు క్రిస్టియన్ మిషనరీలు స్థాపించిన గ్రామర్ స్కూల్, ఆల్ సెంట్స్ స్కూల్, వెస్లీ స్కూల్, సెంట్ ఆన్స్ కాన్వెంటు మొదలయినవి పని చేయసాగినవి. వీటితోపాటు కొన్ని ప్రయివేటు సంస్థలు కూడ స్థాపితమైనవి. వీనిలో ముఫీదుల్ నామ్ హైస్కూల్, కీస్ హైస్కూల్, ధర్మవంత్ హైస్కూల్, మహబూబు కాలేజీ పేర్కొనతగినవి. హైదరాబాదులో 1887 వరకు మెడికల్ ఇంజ నీరింగ్ కాలేజీలు ఏర్పడినవి. కొందరు విద్యావంతులు ఉన్నత విద్య కొరకు ఇంగ్లాండుకు వెళ్ళివచ్చుట కూడ జరుగుచుండెను. న్యాయవాదుల వర్గము ఒకటి అవతరించినది. పత్రికలు స్థాపితమై, ప్రజాభిప్రాయమును దిద్దసాగినవి. 1864 సంవత్సరమున మొట్టమొదటి ఇంగ్లీషు పత్రిక దక్కన్ టైమ్స్ స్థాపించబడినది. 1885 వరకు సుమారు ఇరువది అయిదు ఇంగ్లీషు, ఉర్దూ పత్రికలు వెలువడినవి. షౌకతుల్ ఇస్లాం వంటి ఉర్దూ పత్రికలు పత్రికా స్వాతంత్ర్యమునకై జరిపిన పోరాటము చారిత్రా త్మకమైనది; మహోజ్జ్వలమైనది. అప్పటివరకు ఫార్సీ భాష రాజభాషగా నుండెను. ప్రథమముగా 1884వ సంవత్సరము ఫిబ్రవరి 21 తేదీనాడు ఉర్దూను రాజభాషగా ప్రభుత్వము ప్రకటించినది. క్రమక్రమముగా ఫార్సీ స్థానమును ఉర్దూ ఆక్రమించి రాజభాషగను, విద్యాబోధనా భాషగను రూపొందినది.

హైదరాబాదులోని పరిస్థితులు ఇట్లుండగా 1885వ సంవత్సరము డిసెంబరు నెల 28 వ తేదీనాడు బొంబాయిలోని గోకుల్‌దాసు తేజ్‌పాల్ సంస్కృత కళాశాల భవనమున అఖిల భారత జాతీయ కాంగ్రెస్ స్థాపన జరిగినది. ఈ సంఘటనను హైదరాబాదులోని విద్యావంతులు, స్వాతం త్ర్యోద్యమ నాయకులు హర్షించిన సత్యమును ఇదివరకే ప్రస్తావించినాను.

ఈ విధముగా 1935 వ సంవత్సరమున స్వాతంత్ర్య ఉద్యమము యొక్క రెండవ దశ ముగిసి మూడవ దశ ప్రారంభమగుచున్నది

### స్వాతంత్ర్య సమరయోధులు

1895 వ సంవత్సరమున జవ్వాద్ హుసేన్ అను వ్యక్తి అప్పటి రెసిడెంటును హత్య చేయుటకు ప్రయత్నించిన నేరముపై హైదరాబాదు నుండి వెలుపలకు పంపివేయబడినాడు. 1897లో పూనాలో కర్నల్ రేగాండ్‌ను హత్యచేయ ప్రయత్నించెనను నేరారోపణలో చిక్కుకొన్న ఛాపేకర్ కొంత కాలము హైద్రాబాదుకు వచ్చి దాగుకొని, రాయచూరు జిల్లా గంగావతి తాలూకాలో అరెస్టు చేయబడుట జరిగినది 1879 లో వాసుదేవ్ బల్వంత్ ఫడ్కే అను మహారాష్ట్ర విప్లవ వీరుడు గుల్బర్గా జిల్లాలోని గాన్గాపూర్‌లో అరెస్టు చేయబడెను 1899 లో బాబాసాహెబు అను విప్లవవీరుడు బీడ్ జిల్లాలో గొప్ప తిరుగుబాటు లేవదీసెను. అప్పటి ఇంగ్లీషు సైన్యమునకు యీయన సైన్యమునకు మధ్య సంకుల సమరము జరిగెను. 1899 ఏప్రిల్ నెల 14 వ తేదీ నాడు బాబా సైనికులు చాలా మంది చంపబడి, బాబా పారిపోవుట జరిగినది. తరువాత అతనిని గూర్చిన వివరాలు తెలియవు

### విప్లవ వీరులకు నిలువ నీడయిచ్చిన నేల

1900 సంవత్సరము తరువాత స్వదేశీ ఉద్యమము ప్రారంభ మయినది. బెంగాలు, మహారాష్ట్ర ప్రాంతాల ఉద్యమాల ప్రభావము హైదరాబాదులో కూడ కనపడుచున్నది. హైదరాబాదులో విచారణ చేయబడినవారు, వెలుపలకు పంపబడినవారు, వెలుపలకే వెళ్ళిపోయినవారు చాలామంది కలరు స్వదేశీ ఉద్యమముతోబాటు విప్లవోద్యమము కూడ నడచినది. ఉస్మానాబాదు జిల్లాలోని ఔసాగ్రామములో విష్ణు పింగ్లే అను మహారాష్ట్ర వీరుడు కొన్ని సంవత్సరాలు నివసించెను.ఇండియా వైస్రాయి

హార్డింజ్ పైన బాంబు వేసిన నేరములో చిక్కుకొన్న సేనాపతి బాపట్ కొన్ని సంవత్సరాలు ఔరంగబాద్‌లో దాగుకొనెను. 1909 వ సంవత్సరములో నాసిక్‌జిల్లా కలెక్టరైన జాక్సన్‌ను హత్యచేసిన విద్యార్థిదళ నాయకుడు అనంతకాన్వేరే కొంతకాలము ఔరంగాబాదులో గడిపెను. 1933 లో కాకినాడ బాంబు కేసుతో సంబంధము కలిగిన భయంకరాచారి హైదరాబాదుకు వచ్చి ఆయుధ సామగ్రిని తీసికొని తిరిగివెళ్ళు సందర్భమున కాజీపేటలో పట్టుబడెను.

**శాంతి ఉద్యమాలు - సరోజినీదేవి**

ఈ విధమైన విప్లవ ఉద్యమాలతోపాటు మొదటి ప్రపంచయుద్ధము తరువాత ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటక జిల్లాలలో చట్టబద్ధమైన శాంతియుత ఉద్యమాలు బయలుదేరినవి. ఈ ఉద్యమాలను స్థాపించి పోషించి వారిలో కేశవరావ్ కోరట్‌కర్, వామన్ నాయక్, మాడపాటి హనుమంతరావు గార్లను పేర్కొనవలసియున్నది ఈ విధమైన ఉద్యమాలలో ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటక మహాసభలతో పాటు హైదరాబాదు రాజకీయ మహాసభను కూడ పేర్కొనవలసి యున్నది. విటిలో మార్గదర్శకమైనది ఆంధ్ర మహాసభయని మనము గమనింపవలసియున్నది. రాఘవేంద్రరావు శర్మ, తారానాథ్ మొదలయినవారు యీ కాలమునందలి రాజకీయ బాధితులు. ఖిలాపత్ ఉద్యమంలో చాలా మంది ముస్లింలు పాల్గొనిరి.

హైదరాబాదు కాంగ్రెసు వాదులలో మొట్టమొదటి వారిలో నొకడు ముల్లా అబ్దుల్ ఖయ్యూం. ఈయన కుమారుడే ముల్లా అబ్దుల్ బాసిత్. మన జాతీయోద్యమములో అగ్రశ్రేణి నలంకరించి సకల భారత - కాదు- సకల ప్రపంచ ప్రఖ్యాతి వహించిన విదుషీమణి, వీరనారీమణి, త్యాగమూర్తియైన సరోజినీదేవి హైదరాబాదు వాస్తవ్యురాలు; ఆంధ్రుల ఇంటి కోడలు, అఘోరనాథ్ చటోపాధ్యాయ కూతురు.

# కొన్ని ఉజ్జ్వల ఘట్టములు

**ఆంగ్లేయుల అనుమానాలు**

క్రీ॥ శ॥ 1800 సం॥న నైజాం బ్రిటిష్ ప్రభుత్వానికి సామంతుడై ఒడంబడికను కుదుర్చుకొనినందువలన ఆయన పరిపాలిత ప్రాంతము రక్షిత ప్రాంతమయ్యెను. ఈ ఒడంబడిక ప్రకారము ఇంగ్లీషు వారికి యుద్ధకాలమునందు సహాయము చేయవలసిన బాధ్యత నైజాముకు కలిగెను. కాని కొంతకాలము వరకు నైజాము సహాయము బ్రిటిష్‌వారికి సంతృప్తి కరముగ నుండలేదు. మహారాష్ట్రులతో బ్రిటిషు వారికి కలిగిన యుద్ధములలో నైజాము సైనికులు సక్రమముగా సహకరించలేదని బ్రిటిషువారికి ఆగ్రహము కలిగెను. ఇంతవరకుముందు నిజాము ఫ్రెంచివారి మిత్రుడుగా నుండినందున నైజాము సైన్యమునకు కొంత ఫ్రెంచి పక్షపాతము ఉండి నట్లు అనుమానించబడెను ఫ్రెంచివారితో సైన్యసంబంధము వదలిపోయిన తర్వాతకూడ కొంతమంది ఫ్రెంచివారు నైజాము సైన్యములో పనిచేయు చుండిరి. ఈనాటికిని నల్లగొండకు వెళ్ళు త్రోవలో దిల్సుఖ్‌నగర్ వద్ద ఫ్రెంచివారి గోరీలు కనబడును. హైద్రాబాద్‌లోని త్రూప్ బజారు ఫ్రెంచి సైన్యముల ఉనికివలన త్రూప్ బజారని పేరందెను. ఫ్రెంచి వారి ప్రభావము ఇప్పటికిని హైదరాబాదులోని ఆనాటి భవనములమీద కన బడును. ఇప్పటి గోషామహల్ హైస్కూలులోనికి వెళ్ళి చూచినచో ఫ్రెంచి ప్రభావము గోచరించును. బహుశః ఈ ఫ్రెంచివారితో కలిగిన గాఢ సంబంధము వలననే కాబోలు, చాలాకాలము వరకు నైజాము సైన్యము నకు బ్రిటిష్ వారితో ఆప్తత కుదరలేదు. నిజామ్ సైనికులు బ్రిటిషు వ్యతిరేకులను భావము బ్రిటిషు వారికి గలిగెను, డ్యూక్ ఆఫ్ వెల్లింగ్టన్

అను ప్రసిద్ధిగాంచిన ఆర్థర్ వెల్లస్లీ అపుడు హైదరాబాదు సైనికోద్యోగిగా యుండెను. ఆయన నిజాము సైనికుల యొక్క బ్రిటిషు వ్యతిరేకతను గూర్చి తీవ్రంగా ఆక్షేపించెను దానిపైన అపుడు గవర్నర్ జనరల్‌గా నుండిన వెల్లస్లీ నిజాము ఔదాసీన్యమునకు, నిర్లక్ష్యతకు, మైత్రీ లోపమునకు గట్టిగా మందలించెను. అంతియేగాక నైజాము సైన్యమును కట్టుదిట్టము చేయవలెనని ఆయన సూచించెను. 1812లో అప్పుడు హైద్రాబాదులో రెసిడెంటుగా నున్న ఆంగ్ల మహాశయుడు యూరోపియన్ సైనికులను కొందరిని నైజాము సైన్యములోనికి దిగుమతి గావించి, నైజాము సైన్యమును సంస్కరించు కార్యము నారంభించెను. ఈ విధముగా సంస్కరించబడిన సైన్యమే హైద్రాబాదు కంటింజెంట్. ఈ సైన్యమే హైద్రాబాదు రాష్ట్రములోని తిరుగుబాట్లను అణచివేయుటకు నలుబది వత్సరముల వరకు ఉపయోగపడెను ఈ సైన్యమునకు ముఖ్యకేంద్రము బొల్లారమై యుండెను దీనికి శాఖలు ముక్తల్, లింగ్సుగూర్, మోమినాబాద్, ఔరంగాబాద్ వరంగల్ నగరములలో ఉండెను.

## దివాన్ చందూలాల్ హయాం

సుమారు నలుబది సంవత్సరాలు అనగా హైద్రాబాదు రాష్ట్రానికి సాలార్‌జంగ్ దివానగునంతవరకు, అప్పటి హైదరాబాదు ప్రభుత్వం సక్రమ పరిపాలన, సత్పరిపాలనలను గూర్చి తగిన శ్రద్ధ గైకొనినట్లు కానరాదు. అపుడు దివాన్‌గా నుండిన చందూలాల్‌కు ఇంగ్లీషువారి అనుగ్రహమును సంపాదించుటే ప్రధాన లక్ష్యముగా యుండెను ప్రజలను గూర్చిగాని, పరిపాలనను గూర్చిగాని ఆయన తగిన శ్రద్ధ తీసికొనలేదు. 1800 నుండి 1850 వరకు హైదరాబాదు రాష్ట్ర పరిస్థితు లీవిధముగా నుండెను. నిజానికి ఆ కాలమున ఇంగ్లీషువారిచే శిక్షితమయిన సైన్యమే లేకపోయినచో హైదరాబాదులో చెలరేగిన తిరుగుబాటులను, స్వాతంత్ర్యో

ద్యమాలను అణచ వీలులేకపోయెడిది. ఈ విధముగా తిరుగుబాటుల నణచి నిజాము అస్తిత్వమును నిలబెట్టిన ఇంగ్లీషువారు ఇక్కడి పరిపాలనను సవరించుట తమ కర్తవ్యమని భావించి అందుకొరకై నిజాముకు సలహా నియ్యవలసి యుండెను. కాని వారట్లు చేయలేదు. 1820 సంవత్సరములో ఒక్కసారి మాత్రము సర్ చార్లెస్ మెట్కాఫ్ సర్వే మరియు సెటిల్మెంట్ శాఖలలో (బందోబస్తు) ఇంగ్లీషువారిని నియమించవలసినదని చందూలాల్‌ను కోరెను. కాని యీ కోరిక అప్పుడు దివానుగా నుండిన చందూలాల్‌కు రుచించలేదు. అప్పుడు గవర్నరు జనరల్‌గా లార్డ్ హేస్టింగ్స్ ఉండెను. మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్స్‌కు, మెట్కాఫ్‌కు మధ్య మంచి సంబంధములు లేకపోయినందున చందూలాల్ కొక మంచి నెపము దొరికెను. అందుకొరకు చందూలాల్ ఇంగ్లీషువారు తమ అంతరంగిక వ్యవహారములలో జోక్యము కలుగచేసికొనవలదని గవర్నర్ జనరల్‌కు అసమ్మతి తెలిపెను. అందుచేత మెట్కాఫ్ ప్రారంభించిన యూరోపియన్ ఉద్యోగుల నియామకమను ఉద్యమము కొన్ని సంవత్సరాలలోనే అంతమొందెను. తర్వాత దినదినము పరిపాలనము చెడిపోజొచ్చెను. ఇట్టి పరిస్థితులలో ప్రజలకు తిరుగుబాటొక్కటే మార్గాంతరముగా నుండెను. అందుచేత యీ కాలమందు తిరుగుబాటులు అన్ని జిల్లాలలో వ్యాపించెను. యీ తిరుగుబాటులకు ముఖ్య కారణము దుష్పరిపాలనము. తిరుగుబాటుల నణచుటకు నిజామునకు సహాయము చేసిన ఇంగ్లీషువారు రాష్ట్రములో సత్పరిపాలనను ప్రవేశపెట్టుటకు శ్రద్ధ వహించకపోయిరి. బహుశః పరిపాలన దినదినము చెడిపోయి పరిస్థితి అధ్వాన్నమయినచో రాష్ట్ర పరిపాలనను పూర్తిగా తమ చేతిలోనికి తీసుకొనుటకు తగిన అవకాశము లభించునని ఇంగ్లీషువారు భావించియుండిరేమో! ఎందుకనగా, తర్వాత పరిపాలనా లోపమును కారణముగా పురస్కరించుకొని, రాష్ట్రములోని సారవంత ప్రాంతములయిన బీదరు మొదలయిన వానిని నిజాము నుండి ఇంగ్లీషు

వారు తమ స్వాధీనములోనికి తీసికొనిరి అందుచేతనే హైద్రాబాదు పరిపాలనము యొక్క సంస్కరణను గూర్చి శ్రద్ధవహించక పోవుటవలన ఇంగ్లీషువారి ఉద్దేశాలను అనుమానింపవలసివచ్చుచున్నది.

1817-1857 వరకు హైద్రాబాదు చరిత్ర ప్రజల తిరుగుబాటుల చరిత్ర యని చెప్పవచ్చును. ఈ తిరుగుబాటులకు కారణము దుష్పరిపాలనయనియే చాలమంది గ్రంథకర్తలు అభిప్రాయపడినారు

## ప్రభుత్వముపై ప్రజల తిరుగుబాటు

ప్రభుత్వముపై ప్రజలు చేసిన యీ తిరుగుబాటులో కొన్ని ముఖ్యమైన వాని వివరాలు యీ క్రింది విధముగా నున్నవి.

## నాందేడ్ జిల్లాలోని నాయక్ తిరుగుబాటు

(1) నాందేడ్, పర్భనీ, బీదర్ జిల్లాలలో గంగానదీతీరమున హట్కర్లను ఒక తెగవారు నివసించుచుండిరి ఈ తెగవారి నాయకులు సుమారు 20 సంవత్సరాల కాలము క్రీ.శ. 1819 వ సంవత్సరము వరకు నిరంతరము వరుసగా తిరుగుబాటులు చేయుచునే యుండిరి. వీరి నాయకుడు నౌసాది, నాందేడ్‌కు 20 మైళ్ళ దూరమున నున్న నావా దుర్గమున కధిపతిగా నుండెను 1819 వ సంవత్సరమున బ్రిటిష్‌వారి నాయకత్వమున హైదరాబాదు సైన్యాలు ఈ దుర్గమును ముట్టడించి, 24 రోజులు యుద్ధము గావించి, తుట్టతుదకు బహుకష్టముమీద అతి ప్రయాసతో కోటను స్వాధీనము చేసుకొనిరి. ఈ కోటలో 538 మంది యుండిరి. అందులో 438 మంది యుద్ధములో చంపబడిరి. 80 మంది తీవ్రముగా గాయపడిరి 20 మంది మాత్రమే సజీవులుగా నుండిరి. బ్రిటిష్‌వారి సైన్యమునకు కూడ చాల నష్టములు కలిగెను. తరువాత హట్కర్ల స్వాధీన

ముగనున్న మరికొన్ని కోటలు కూడ పట్టుకొనబడి, వారి తిరుగుబాట్లు అణచివేయబడెను (2) 1818 వ సంవత్సరమున జూలై నెలలో బీడ్ జిల్లాలో ధర్మాజ్ ప్రతాపరావు అను వీరుడు బ్రిటిష్‌వారికి వ్యతిరేకముగా తిరుగుబాటు చేసెను. అయన కోట 'దివి'. బ్రిటిష్‌వారి సైన్యాలు దివిమీద దాడిచేసి, తీవ్ర ప్రతిఘటన తరువాత దానిని పట్టుకొనెను. (3) 1818 వ సంవత్సరము మే నెలలో రాయచూర్ జిల్లాలో వీరప్ప యను యోధుడు తిరుగుబాటు గావించి "కొప్పల్" మరియు "బహద్దుర్ బంద" అను కోటలను స్వాధీనము చేసుకొనెను తరువాత అప్పుడు లెఫ్టినెంట్ కర్నల్ ప్రేజర్ నాయకత్వమున హైద్రాబాద్ సైన్యము ఈ కోటలను స్వాధీనము గావించుకొనెను (4) 1822 వ సంవత్సరములో ఆదిలాబాదు జిల్లాలోని మాహూర్‌లో మరొక తిరుగుబాటు చెలరేగగా, కమాండర్ గోర్డన్ నాయకత్వమున కొంత సైన్యము వెళ్ళి దానిని అణచివేసెను (5) 1820 వ సంవత్సరమున బీదర్ జిల్లాలోని ఉద్గీర్‌లో దేశ్‌ముఖ్ శివలింగయ్య తిరుగుబాటు గావించి, కొన్ని కోటలను ఆక్రమించుకొనెను అప్పుడు హైద్రాబాదు సైన్యము దాడిచేయగా శివలింగయ్య తప్పించుకొని పోయెను. కాని ఉద్గీర్, జల్కోడ్, బత్తిదామ్, సూలాలికోటలు బ్రిటిష్‌వారి స్వాధీనమయ్యెను. తిరుగుబాటు అణచివేయబడెను. 1821 వ సంవత్సరమున బీదర్ జిల్లాలోని క్రిష్టాపూర్ ప్రాంతమున తిర్మల్‌రావు తిరుగుబాటు గావించెను. (6) 1821 లో నిజామాబాదులోని సిర్నపల్లిలో, భవానీపేటలో, కామారెడ్డి వద్ద బీబీపేటలో తిరుగుబాటుకు లక్ష్మణరెడ్డి నాయకత్వము వహించెను ఈ తిరుగుబాటులన్ని తరువాత అణచివేయబడినవి. ఇంచుమించగ ఈ కాలముననే మంతెన తాలూకాలోని "మహదేవ్‌పూర్"లో ఒక తిరుగుబాటు చెలరేగెను. (7) భిల్లుల తిరుగుబాటులు ఈ కాలమున చాల జరిగినవి. 1818 మరియు 1822 సంవత్సరము లందు రెండు సార్లు భిల్లులు ఔరంగాబాదులో తిరుగుబాటు గావించిరి. తిరుగుబాటులు 1860 వ సంవత్సరము వరకు సాగుచునే యుండెను. 1859 వ సంవత్సరము అహమ్మదనగరములో భాగోజీ నాయక్, ఔరంగాబాదులో

గోపింకరావు కాశీరాజ్, షాభాజీ నాయక్ అనువారలు భిల్లుల తిరుగుబాటు లకు నాయకత్వము వహించిరి.

### చెలరేగిన స్థానిక నాయకులు

1841 వ సంవత్సరమున రాయచూర్ జిల్లాలో తిరుగుబాటు చెల రేగెను. ఈ తిరుగుబాట్లకు కోప్రాహ్ అను అరబ్బుతోపాటు నరసింగరావను యోధుడు నాయకత్వము వహించి, దేవ్‌దుర్గ్‌వద్ద సైన్యమును సమీక రించుకొనిరి. వీరు అనగొందివద్ద గొప్ప యుద్ధముచేసి బీజపూర్ జిల్లాలో ప్రవేశించి 'బాదామి' అను దుర్గమును పట్టుకొనిరి. తరువాత ఈ కోటలను హైద్రాబాదు సైన్యము తమ స్వాధీనము గావించుకొని కోప్రాహ్, నర్సింగ రావులను బంధితులను గావించెను 1831 లో మహబూబ్‌నగర్ జిల్లాలోని వనపర్తియందు లక్ష్మయ్యా అను యోధుడు తిరుగుబాటు గావించెను. 1860 లో ఆదిలాబాదు జిల్లాలోని నిర్మల్‌లో రామాగౌడ్ అను వీరుడు తిరుగుబాటు చేసెను. భద్రాచలము జమీందారుకూడ యీ కాలముననే ఒక తిరుగుబాటుకు నాయకత్వము వహించెను ఇది క్లుప్తముగా కొన్ని ముఖ్యమైన తిరుగుబాట్ల చరిత్ర. గమనించదగిన విశేష మేమనగా, యీ తిరుగుబాట్లకు రోహిలాలుగాని, అరబ్బులుగాని నాయకత్వము వహించ లేదు వీనికి జిల్లాలలో స్థానికులైన వీరులే నాయకత్వము వహించిరి. నలుబది సంవత్సరాలవరకు నిరంతరము కొనసాగిన యీ తిరుగుబాట్లను అణచివేయుట ఇంగ్లీషువారిచే శిక్షితమైన నైజాం సైన్యమునకు ఒక పెద్ద సమస్యగా నుండెను. బహుకష్టముతో యీ తిరుగుబాట్లు అణచివేయబడెను. 1857 వ సంవత్సరము తరువాత ప్రభుత్వ విధానమున కొంత మార్పు వచ్చెను. పరిపాలనా విధానమును బాగుచేసి ప్రభుత్వమును సమర్థవంత ముగా నిర్వహించనిచో రాష్ట్రమునకు భద్రతలేదను సత్యము తుట్టతుదకు హైద్రాబాదు ప్రభుత్వము గ్రహించక తప్పలేదు. విదేశ పరిపాలనమును, ప్రజల శ్రేయస్సును అభిలషించని ప్రభుత్వమును ప్రజలు ఎన్నడూ సహించలేరని యీ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర నిరూపించుచున్నది.

# 19 వ శతాబ్దమున హైదరాబాదులో పత్రికా స్వాతంత్ర్యము

## ప్రాథమికస్వత్వాలు - పత్రికలు

పోలీసు చర్యకు పూర్వము హైదరాబాదు రాష్ట్రమున పత్రికలు కఠిన నిర్బంధములకు గురియైన సత్యము సుప్రసిద్ధము. నిజానికి హైదరాబాదు ప్రజల పోరాటము ప్రాథమిక స్వత్వముల సాధన కొరకు జరిగిన పోరాటమే. గడచిన శతాబ్దమున హైదరాబాదు ప్రజల స్వాతంత్ర్య సమర వృత్తాంతమును పరిశీలించినపుడు నిర్భయముగా ప్రజల పక్షము వహించిన పత్రికల బాధలు మనకు ప్రస్ఫుటముగా కనబడుచున్నవి 19 వ శతాబ్దమున హైదరాబాదు రాష్ట్రమున ప్రజల భాషలలో నడిపిన పత్రికలు లేకుండెను. ఒకటి రెండు ఇంగ్లీషు పత్రికలు, కొన్ని ఉర్దూ పత్రికలు మాత్రము ఉండెను ఆ పత్రికలకు గూడ ప్రజలపక్షము వహించి ప్రభుత్వమును విమర్శించు అవకాశము నిరాకరింపబడెను ఈ సందర్భమున దొరికిన కొన్ని వివరాలు గమనించదగి యున్నవి.

## పత్రికలపై ప్రభుత్వం దాడి

హైదరాబాదు రాష్ట్రమున 1891 వ సంవత్సరమున ఆస్మాన్‌జా ముఖ్యమంత్రిగా నుండెను అయన పరిపాలనలో పత్రికాస్వాతంత్ర్యము మీద మొదటిసారి తీవ్రమైన దాడి జరిగినది. ఈ సంవత్సరమున అప్పుడు హోమ్ సెక్రటరీగా నుండిన ఫతేనవాజ్ జంగ్ బహద్దూర్ సంతకముతో పోలీస్‌కమీషనర్‌కు ఒక నోటీసు జారీ చేయబడినది. ఆ నోటీసు ప్రకారం (1) "అప్సరుల్ అఖ్బార్" అను ఒక పత్రికనుండి ప్రభుత్వ అనుమతి

కొరకై విజ్ఞప్తి చేయవలసినదని కోరబడినది. అప్పటివరకు పత్రికలు నడుపుటకు ప్రభుత్వము అనుమతి అవసరము లేకుండెను అంతేగాక అప్పటికి 18 నెలలముందే ఆ పత్రికయొక్క ప్రకటన ఆగియుండెను. అయినను పునః ప్రకటన కొరకు ప్రభుత్వముయొక్క ఆజ్ఞ తీసుకొన వలసినదని యీ పత్రిక ఆదేశింపబడినది. (2) పత్రికలు ప్రభుత్వమునకు ఒక "ఎకరార్‌నామా" కూడా వ్రాసి యీయవలసినదని ప్రభుత్వము ఆజ్ఞాపించినది. "దక్కన్ పంచ్", హైద్రాబాద్ గెజెట్"లు ఈవిధమైన "ఎకరార్‌నామా"లు దాఖలు చేసియుండెను. ఇతర పత్రికలు కూడా ఆ విధముగనే దాఖలు చేయవలెనని కోరబడినవి. (3) "ఎకరార్ నామా"లో ఉల్లేఖించబడిన షరతుల నుల్లంఘించుటకు వీలులేదు ఇట్లు ఉల్లంఘించిన పత్రికలను గూర్చి పోలీస్ కమీషనర్ వెంటనే ప్రభుత్వము నకు రిపోర్టు చేయవలెను అత్యవసరమని తోచినప్పుడు ఏ పత్రికనైనను ఆపివేయుటకు పోలీస్ కమీషనర్‌కు ఆజ్ఞ యీయబడెను ఈ విధముగ పత్రికా స్వాతంత్ర్యము పోలీసువారి అదుపుఆజ్ఞలకు పరిమితము చేయ బడినది.

### పత్రికల నేడిపించిన ఏడు షరతులు

ఈ ఎకరార్‌నామాలోని ఏడు షరతులను పరిశీలించినప్పుడు పోలీసుల చేతులలో పత్రికలు ఉండవలెనను ఉద్దేశము వాని వెనుకనుండి తొంగిచూచుచున్నది. ఈ షరతుల ప్రకారము (1) బ్రిటిష్ ప్రభుత్వమునకు వ్యతిరేకముగా ఏమియు వ్రాయరాదు. (2) నైజాం ప్రభుత్వానికి వ్యతి రేకముగా అసలే వ్రాయగూడదు. (3) బ్రిటిష్ ఇండియాలో కాని, హైద్రాబాదు నందుకాని ప్రజలలో అభిప్రాయ భేదాలు, మత సంఘర్షణ లకు దారితీయు వ్రాతలు వ్రాయరాదు. యీ వ్రాతల ధోరణిని నిర్ణయించు వారు పోలీసు అధికారులే (4) ఎవరికిని భయము, బెదిరింపు, విచారము

కలిగించు వ్రాతలు వ్రాయకూడదు (5) ప్రభుత్వోద్యోగులను బెదిరించు వ్రాతలు వ్రాయరాదు. (6) ఆకాశరామన్న ఉత్తరాలు ప్రకటించగూడదు. విలేఖరి పేరులేని వ్రాతలు ప్రకటించకూడదు (7) ప్రజలకు ప్రభుత్వము మీదగాని, ప్రభుత్వ ఉద్యోగుల మీదగాని చెడ్డ అభిప్రాయము కలిగించు వ్రాతలు వ్రాయగూడదు ఇటువంటి హిరణ్యాక్ష వరములు ఇంకెన్నియో పత్రికల నుండి కోరబడెను. ఈ షరతుల నుల్లంఘించినచో పత్రికల నాపుటకు ప్రభుత్వమునకు అధికారము కలదు పత్రికలను ఆపుటవలన కలుగు నష్టమునకు ప్రభుత్వము బాధ్యత వహించదు. ఇన్ని షరాలను అంగీకరించి నడపిన పత్రికలు ప్రజలకు ప్రాతినిధ్యము వహించుట కెట్టి అవకాశము లేదు. ఈ షరతుల ప్రకారము నడిపిన పత్రికలు ప్రభుత్వము గెజెట్లుగనో లేక సమాచార శాఖవారు ప్రకటించు సమాచార వాఙ్మయము గనో తయారగుట స్పష్టము.

1891 కి ముందు పత్రికలను నడుపుటకు ప్రభుత్వము నుండి అనుమతి తీసుకొనవలెనను నిర్బంధము లేకుండెను. ఈ సమయముననే బ్రిటిషు ఇండియాలో గవర్నరు జనరల్ యీ విధమైన ఒక ఉత్తరువును జారీ చేసినట్లు తెలుస్తుంది. ఆ ఉత్తర్వు యొక్క పుత్రికయే హైద్రాబాదు హోమ్ సెక్రటరీగారి ఆజ్ఞయని చెప్పబడుచున్నది. పోలీసు చర్యకు పూర్వము ప్రజల మీద విశృంఖలముగా పుంఖానుపుంఖముగా ప్రయోగింపబడిన, గష్తినిషాన్ 53 అను వాగ్బంధన శాసనము పైన పేర్కొనిన ఉత్తర్వు యొక్క సంతానమే.

### సాహసోపేత ధిక్కారము

ఆ రోజులలో కొన్ని పత్రికలు ధైర్యముగా యీ షరతుల అమలును వ్యతిరేకించినవి. 1891 వ సంవత్సరం జూన్ 11 వ తేదీనాడు

"దక్కన్ టైమ్స్" అను పత్రికలో ప్రభుత్వం కోరిన "ఎకరార్‌నామా" యొక్క అనువాదము ప్రకటింపబడినవి ప్రభుత్వము ఇటువంటి షరతుల విధించుట చాలా అన్యాయమని, ఇది దురాక్రమణ అనియు, ప్రజాస్వామిక వ్యతిరేక చర్య యనియు ఈ ప్రకటనలో తీవ్రముగా నిరసించబడినవి. ఆ కాలమున హైదరాబాదులో "షౌకతుల్ ఇస్లాం" అను ఒక పత్రిక యుండెను ఈ పత్రికా సంపాదకుడు 'హాజీకర్తాన్' నిర్భయ స్వభావుడు, ప్రజాస్వామికవాది. అందుచేత యీ ఎకరార్ నామాకు వ్యతిరేకముగా ప్రభుత్వముతో పోరాడెను. ఆ పోరాటము చరిత్రాత్మకమైనది; ఉజ్వల మైనది. ఈ సందర్భమున ఆయన వ్రాసిన వ్రాతలు ఆంధ్రీకరించి ప్రకటించినచో ఆనాడు ప్రజల హృదయాలలో యెటువంటి అగ్ని రగులు కొని యుండెడిదో స్పష్టము కాగలదు. 1891 జూన్ 14 వ తేదీనాటి "షౌకతుల్ ఇస్లాం" అనుబంధములో ప్రజల నుద్దేశించి ఒక బహిరంగ లేఖ ప్రకటించబడెను ఈ లేఖలో మొత్తము భారతదేశమునందు ఒక్క హైద్రబాదు రాష్ట్రములోనే మధ్యకాలపు రాజరికము చెలాయించబడు చుండెననియు, ప్రభుత్వోద్యోగులు స్వార్థపరులు. లంచగొండులు, అధి కార దుర్వినియోగము చేయువారై యున్నారనియు, వారి మనస్తత్వమే ఈ ఎకరార్‌నామాలో ప్రతిబింబించుచున్నదనియు ప్రజలు తమ అభి ప్రాయాలను ఈ విషయములో స్వేచ్ఛగా ప్రకటించవలెననియు, వానిని పత్రికకు పంపించవలెననియు ఉద్ఘాటించబడినది. ఈ సందర్భములో పోలీసు కమీషనరుకు సంపాదకుడు వ్రాసిన ఉత్తరముగూడ చాల గొప్పది. ఈ ఉత్తరములో ఎకరార్‌నామాయొక్క నియమము తీవ్రముగా నిరసించ బడినవి. ప్రభుత్వము ఉద్దేశము గట్టిగా ప్రశ్నించబడినది ఈ సంద ర్భమున ప్రభుత్వము అనుసరించదలచిన విధానమేమిటో తెలుపవలసిన దని కూడ యిందులో ప్రశ్నింపబడినది. "షౌకతుల్ ఇస్లాం" 14 న జూన్ 1891 నాటి 35 వ సంచికలో హోం సెక్రటరీగారి యీ ఉత్తరవు

లను గూర్చి సంపాదకీయముగా తీవ్ర విమర్శ చేయుట జరిగినది ఈ సంపాదకీయములో మిక్కిలి కఠినమైన పదజాలము ఉపయోగించ బడినది. లంచగొండితనము, అధికార దుర్వినియోగము, నిరంకుశత్వము, స్వార్థపరత్వము మొదలయిన వానికి అలవాటు పడిన ప్రభుత్వోద్యోగుల దుశ్చర్యలే ఈ ఉత్తర్వు రూపము పొందినవని యిందులో ఉద్ఘాటించ బడినది ఇవి అనాగరిక చర్యయని తెలుపబడినవి. ఈ ఉత్తర్వులకు హంతక కాండయని ఈ సంపాదకీయములో నామకరణము చేయబడినది. సకల భారతమందలి పత్రికాచరిత్రలో యింత నిర్భయముగా వ్రాసిన సంపాదకీయాలు మిక్కిలి తక్కువ. పత్రికాసంపాదకులు, స్వాతంత్ర్య ప్రియులందరు ఈ సంపాదకీయమును పఠించవలసియున్నది. తరువాత కొన్ని రోజులకు "జైనొద్దీన్" అను పోలీసు "మొహత్మీమ్" సంతకముతో వెంటనే ఎకరార్‌నామా ఈయవలసినదని సంపాదకునికి నోటీసు అందజేయబడినది సంపాదకుడు యీ "ఎకరార్‌నామా" షరతుల గురించి వ్యాఖ్యానించుచు వాడిన పదాలు గమనించదగినవి. 'నాజాయజ్' 'నాలాయఖ్' 'ఖుప్యత్‌ఖోర్' 'బద్మాష్' మొదలైన పదాలు ఇందులో ఉపయోగించబడినవి తరువాత రెండు వారాలకు అప్పుడు హోమ్ సెక్రట రీగా నున్న ఫతేనవాజ్ జంగ్ సంతకముతో జారీ చేయబడిన ఉత్తర్వు ననుసరించి ఈ పత్రిక ఆపుచేయబడెను. ఈ ఉత్తరువులో అప్పటి ముఖ్య మంత్రియైన నవాబ్ అస్మాన్‌జా బహద్దుర్‌గారి దృష్టికి 'షౌకతుల్ ఇస్లాం' 35 వ సంచికలోని సంపాదకీయము తీసుకొని రాబడినదని, అందులో ఉపయోగింపబడిన పదజాలము కఠినముగాను, అసభ్యముగా ఉన్న దనియు, చేయబడిన ఆరోపణలు నిరాధారమైనవనియు తెలుపుచు పత్రికను

వెంటనే ఆపివేయ వలసిందని ఉత్తరువు పంపబడినది. ముద్రణాలయము మాత్రం యజమాని కీయవలసినదని ఆజ్ఞాపింపబడెను. అయితే ఒక షరతు విధింపబడినది ఆ షరతు ప్రకారము ముద్రణాలయము ప్రభుత్వమునకు వ్యతిరేకముగా ఏ రాజకీయ ప్రయోజనాలకు వినియోగించనని యజమాని ఒక "ఎకరార్‌నామా" దాఖలు చేయవలెను. ఈ విధముగా 'షౌకతుల్ ఇస్లాం' పత్రిక ఆపివేయబడినది. ఇది హైద్రాబాదు వాగ్బంధన శాసన పిశాచ తాండవముయొక్క అనేక నిదర్శనాలలో ఒక్కటి మాత్రమే హైద్రాబాదు స్వాతంత్ర్య చరిత్రలో యిటువంటి ఉజ్వల ఉదాహరణలింకెన్నియో కలవు.

# తెలంగాణములో ఆంధ్రోద్యమము

## ఆంధ్రభాషకు అజ్ఞాతవాసము

రెండునూర్ల పాతిక సంవత్సరాల అసఫ్జాహి పరిపాలన ఫలితముగ హైద్రాబాదు రాష్ట్రములో ఆంధ్రుడు తేరకాంధ్రుడైనాడు. అతనికి అరబ్బీ, ఫారసీ భాషలతో అక్షరాభ్యాసము కావించు దుస్థితి కలిగినది. ఉర్దూ భాషయే రాజభాష; మరియు ప్రాథమికదశనుండి విశ్వవిద్యాలయ దశవరకు బోధనా భాష అయినందున ఆంధ్రభాషకు కొన్ని శతాబ్దాల అజ్ఞాతవాసము ప్రాప్తించినది. ఈ కాలమున ఆంధ్రుడు అన్ని రంగము లందు వెనుకబడినాడు. పరిపాలనా రంగమున అతనికి తగిన స్థానము లభింపలేదు. పరదా, వరశుల్కము మొదలైన సాంఘిక దురాచారాలు ప్రబలియుండెను. తెలుగు రైతు పన్నుల భారముతో క్రుంగి, దరిద్రదేవత పాదాల క్రింద నలిగిపోయెను. చదువుకున్న వారి సంఖ్య నూటికి మూడింటి వరకు దిగజారెను. తెలంగాణమున పాఠశాలలు, కళాశాలలు చాలా కొద్దిగా నుండెను. ఇట్టి పరిస్థితులలో ప్రారంభమయినది ఆంధ్రోద్యమము.

## ఆంధ్రోద్యమ ప్రారంభము

హైదరాబాదు నగరమున 1-9-1901 వ సంవత్సరమున స్వర్గీయ కొమర్రాజు వెంకటలక్ష్మరావు ప్రోత్సాహముతో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము స్థాపితమైనది ఈ ప్రయత్నమున లక్ష్మణరావు గారి సహచరులుగా నిలచి పని చేసిన వారు మునగాల రాజాగారు

స్వర్గీయ రావిచెట్టు రంగారావుగారు. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ మును తెలంగాణమందేకాక, సకలాంధ్రమందును మొట్టమొదటి గ్రంథా లయముగా పేర్కొనవచ్చును. తెలంగాణమునందలి హనుమకొండ, వరంగల్ మొదలయిన పట్టణాలలో 1901 నుండి 1910 వరకు మరికొన్ని గ్రంథా లయాలు లక్ష్మణరావుగారి ప్రోత్సాహమున స్థాపితమయినవి. ఈ కాలము ననే విజ్ఞానచంద్రికా గ్రంథమండలి కూడ హైదరాబాదులో స్థాపితమైనది. విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిని ఆంధ్ర-తెలంగాణాల మధ్య దృఢమైన సాంస్కృతిక బంధనముగా ఏర్పాటు గావించిన లక్ష్మణరావుగారే విశా లాంధ్ర ఉద్యమానికి కూడ పునాదులు వేసిరని చెప్పవచ్చును. హైదరా బాదులో ఆంధ్రోద్యమము యీ విధముగా యీ శతాబ్ద ప్రారంభమున వైజ్ఞానికోద్యమముగా ప్రారంభమయి, క్రమక్రమముగ రాజకీయోద్యమ ముగ పరిణమించినది. ఆనాడు గ్రంథాలయోద్యమముద్వారా తెలంగాణ మును ప్రబోధించిన వారిలో కీ॥ శే॥ ఆదిపూడి సోమనాథరావు, కీ॥ శే॥ మైలవరపు నరసింహశాస్త్రి గారలను ప్రత్యేకముగ స్మరించ వలసి యున్నది. శేషాద్రిరమణ కవుల "నిజాంరాష్ట్ర ప్రశంస" అను ఖండ కావ్యమును ప్రత్యేకముగ పేర్కొన వలసియున్నది.

### మేలుకొలిపిన సంఘటన

ఇరువది సంవత్సరాల గ్రంథాలయోద్యమము తెలంగాణాను కొంత మేల్కొలిపినది. ఇట్టి సందర్భంలో 1921 వ సంవత్సరమున హైదరా బాదు నగరమున సుప్రసిద్ధ మహారాష్ట్ర విద్వాంసుడైన కర్వే పండితుని అధ్యక్షతన జరిగిన సంఘసంస్కరణ సభలలో అప్పుడు హైదరాబాదులో న్యాయవాదులుగా నుండిన ఆలంపల్లి వెంకటరామారావుగారు తమ ఉప న్యాసమును తెలుగులో ప్రారంభించగా, సభ్యులు చప్పట్లతో హేళనగావిం చిన సంఘటన చరిత్ర నిర్మాణమునకు కారణభూతమైనది. ఈ సంఘటనను

అవమానముగ భావించిన ఆంధ్రులు ఆనాటి రాత్రి కీ॥శే॥ టేకుమాల రంగారావుగారి ఇంటిలో సమావేశమై, ఆంధ్ర జనసంఘమును స్థాపించిరి. ఇది ఆంధ్రోద్యమ చరిత్రలో మహత్తరమైన సంఘటన. ఆంధ్ర జనసంఘ స్థాపన గావించిన సమావేశములో బూర్గుల రామకృష్ణారావు, పద్మవిభూషణ మాడపాటి హనుమంతరావు, ఆదిరాజు వీరభద్రరావు మొదలయిన పెద్దలు పాల్గొనియుండిరి. ఈ ఆంధ్ర జనకేంద్ర సంఘము తత్‌క్షణమే తన పనిని ప్రారంభించి, నూరుగురు సభ్యులను చేర్పించి 4-4-1922 నాడు కొండా వెంకటరంగారెడ్డిగారి అధ్యక్షతన సమావేశమును ఏర్పాటు కావించి, చిత్తునియమావళి నామోదించి కార్యనిర్వాహక వర్గమును ఎన్నుకొనుట జరిగినది. ఆనాటి కార్యనిర్వాహక వర్గమునకు కీ॥శే॥ బారిష్టరు రాజగోపాలరెడ్డిగారు అధ్యక్షులుగను, మాడపాటి హనుమంతరావు పంతులు గారు కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి.

## ఆంధ్ర జనసంఘము ఆదర్శములు

1. ఈ సంఘమునకు నిజాం రాష్ట్రాంధ్ర జనసంఘమని పేరు.
2. నిజాం రాష్ట్రము నందలి ఆంధ్రుల యందు పరస్పర సానుభూతిని కలిగించి, వారి అభివృద్ధికై ప్రయత్నించుట యీ సంఘము ఉద్దేశము.
3. ఈ రాజ్యములోని ఆంధ్రులకొరకు సంఘములను, సంస్థలను స్థాపించుట, ఉన్నవానికి సహాయము చేయుట, ఉపన్యాస సభలను సమావేశపరచుట మున్నగు కార్యముల వలన పై ఉద్దేశములు నెరవేర్చబడును.
4. ఈ రాజ్యములోని ప్రతి ఆంధ్ర వ్యక్తియు, పదునెనిమిది వత్సరములకన్న మించిన వయస్సు కలిగి, చదువను, వ్రాయను నేర్చినచో యీ సంఘమున సభాసదుడు కావచ్చును.

### ఉన్నత ఆశయాలు

ఈ ఆంధ్రజన కేంద్రసంఘము స్థాపితమైన సంవత్సరము తరువాత అనగా 1923 వ సంవత్సరమున ఒక ఉపనియమావళి సిద్ధము చేయబడి, అందులో జిల్లాలలోను, కేంద్రమునందును ఆంధ్రజన సంఘము నెరవేర్చవలసిన విధులు యీ విధముగా నిర్ణయింపబడినవి:

అ. గ్రంథాలయములను స్థాపించుట, పఠన మందిరములను పాఠశాలలను స్థాపించుట.

ఆ. విద్యార్థులకు సహాయము, ప్రోత్సాహము చేయుట.

ఇ. విద్వాంసులను గౌరవించుట.

ఈ. తాళపత్ర గ్రంథములను, శాసనముల ప్రతులను సంపాదించుట, పరిశోధించుట.

ఉ. కరపత్ర మూలమునను, లఘుపుస్తక మూలమునను విజ్ఞానము వ్యాపింపజేయుట.

ఊ. ఆంధ్రభాషా ప్రచారమునకై వలయు ప్రయత్నములు జరుపుట.

ఋ. వ్యాయామములను, కళలను ప్రోత్సాహపరచుట.

ౠ అనాథలగు వారికి అత్యవసరమగు సహాయము చేయుట.

### ఉద్ధృత ప్రచారము

ఈ ఆదర్శములను, సాధనములను గమనించినపుడు యీ సంస్థ నిజాం రాష్ట్రవాసులైన స్త్రీ పురుషులకు మాత్రమే పరిమితమయినటుల స్పష్టమగుచున్నది. తరువాత నగర ఆంధ్ర జనసంఘ కార్యకర్తల పర్యటన, ప్రచార, ప్రబోధ ఫలితముగ జిల్లాలలో ఆంధ్ర జనసంఘములు స్థాపితమైనవి. 1-4-1928 నాడు యీ విధముగ స్థాపితమయిన హైదరాబాదు, సికింద్రాబాదు, వరంగల్లు, ఖమ్మం, హుజూరాబాదు ప్రతినిధులు

హనుమకొండలో సమావేశమై, ఆంధ్రజన కేంద్ర సంఘ నియమావళి నంగీకరించిరి.

ఈ విధముగ ఏర్పడిన కేంద్ర సంఘము మొదటి సమావేశము 27-7-1923 నాడు హైదరాబాదులో ఏర్పాటు జరిగి, ఆంధ్ర జనకేంద్ర సంఘములు చేయవలసిన కార్యములను నిర్ణయించినది. ఈ కార్యములను పరిశీలించినపుడు ఆంధ్రజన సంఘముల కార్యక్షేత్రము విద్య, వైజ్ఞానిక, వర్తక, వ్యాయామాది సమస్యలకు మాత్రమే పరిమితమై యుండి, రాజకీయాలకు దూరముగా నుండినట్లు స్పష్టము కాగలదు. తరువాత కేంద్ర సంఘ సమావేశాలు నల్లగొండ, మధిర, సూర్యాపేట, జోగిపేట, దేవరకొండ, ఖమ్మం, సిరిసిళ్ళలో మొత్తం ఎనిమిది సమావేశాలు జరిగినవి. ఈ కాలమున ఆంధ్ర జనకేంద్ర సంఘము కార్యక్రమమును పరిశీలించినపుడు విద్యార్థులను ప్రోత్సహించుట, గ్రంథాలయములను స్థాపించుట, గ్రంథాలయ సభలను నిర్వహించుట, వర్తక సంఘములను స్థాపించుట, వర్తక సమస్యలను గూర్చిన లఘు పుస్తకములను ప్రచురించుట, వెట్టిచాకిరి మొదలగు సామాజిక సమస్యలను గూర్చి ప్రబోధము గావించి తీర్మానాలు చేయుట, పాఠశాలల స్థాపనను గూర్చిన సమస్యలను చర్చించుట, ప్రచారకార్యక్రమమును నిర్వహించుట ప్రధానముగ గన్పట్టుచున్నది. మధిర, సూర్యాపేటలో ఈ కేంద్ర సంఘ సమావేశాలతో పాటు రెండు గ్రంథాలయ సభలు కూడ జరిగినవి. తాళపత్ర గ్రంథ సేకరణను గూర్చి యీ సంఘము ప్రత్యేక శ్రద్ధను వహించి, ఒక ఆంధ్ర పరిశోధక సంఘమునుకూడ స్థాపించినది. ఇదియే లక్ష్మణరాయ పరిశోధక మండలి. ఈ మండలి, విశేషించి మండలి యొక్క కార్యదర్శి ఆదిరాజు వీరభద్రరావుగారు తెలంగాణమండలి శాసనములను సేకరించి ప్రకటించుటలో ప్రశంసనీయమయిన కృషిని గావించిరి.

**అండగా నిలిచిన పత్రికలు**

ఈ కాలమున ఆంధ్రోద్యమమునకు అండగా నిల్చిన "నీలగిరి" (స్థాపితము 24-8-1922 నల్లగొండ), "తెలుగు పత్రిక" (స్థాపితము 27-8-1922 మానుకోట తాలూకా) అను వారపత్రికలను ప్రత్యేకముగ ప్రశంసించవలసి యున్నది. 10-5-1926 నాడు ఆంధ్రోద్యమునకు పెట్టనికోటగా 'గోలకొండ' పత్రిక ప్రారంభమైనది. ఆంధ్రోద్యమ వ్యాప్తికి, వికాసమునకు ఈ పత్రికలు మిక్కిలి తోడ్పడినవి. ఆంధ్రజన సంఘము కేవలము రాజకీయేతర సమస్యలనే తీసుకున్నప్పటికిదీ ఈ సభల సందర్భమున ప్రభుత్వము యొక్క వ్యవసాయ, పశువికిత్స, సహకార, వైద్యశాఖల ప్రదర్శనాలు ఏర్పాటు చేసినప్పటికిని, ఇతర విధములుగ ప్రభుత్వముతో సహకరించుటకు ప్రయత్నించినప్పటికిని, ప్రభుత్వమునకు మాత్రము ఇందులో ఏవో రాజకీయాలు ఇమిడియున్నవను అనుమానము అప్పుడప్పుడు కలుగుచుండెను. ఈ అనుమానముతో సభలకు అనుమతి నిచ్చుటయందు ప్రతిబంధకములు కల్పించబడినవి. అప్పుడు హైదరాబాదులో నుండిన వాగ్బంధన శాసనము యొక్క ప్రతిబంధకములను గూడ యెదుర్కొనవలసి వచ్చెను. ఈ వాగ్బంధన శాసన ప్రయోగము వలన ప్రభుత్వము అనుమతిలేక సమావేశాలు జరుపుటగాని, పత్రికలు నడుపుటగాని సాధ్యముగాని పరిస్థితి యేర్పడి యుండెను. ఈ అనుమతి సాధారణముగా దొరుకుచుండెడిది కాదు. విశ్వప్రయత్నము గావించవలసి వచ్చెడిది. ఇట్టి ప్రతికూల పరిస్థితులలో ఈ ఆంధ్రోద్యమ నౌకను బహు జాగ్రత్తగా నడిపిన గౌరవము మాడపాటి హనుమంతరావు పంతులుగారికి చెందుచున్నది. క్రమక్రమముగ ప్రత్యక్ష రాజకీయాలకు దూరమైనప్పటికినీ, ప్రజల కష్ట నిష్ఠురములను గూర్చి ఈ సభలు శ్రద్ధ వహించక తప్పదియ్యెను. అందుచేత తిప్పర్తి, సూర్యాపేట మున్నగుచోట్ల రైతుల కష్ట సుఖములను విచారించుటకు రైతు సంఘములు స్థాపించుట కూడ జరిగెను.

మొత్తము మీద 1930 వ సంవత్సరము వరకు అనగా మొదటి ఎనిమిది సంవత్సరాల కాలము ఆంధ్ర సంస్కృతిని, ఆంధ్ర భాషను కాపాడుటకు కృషి సల్పుటయే ఆంధ్రోద్యమము యొక్క ఆశయమయి యుండెను. ఈ కాలమున స్త్రీల సభలను ఏర్పాటు చేసి మహిళలలో ప్రచారము చేయు కార్యక్రమము నిర్వహించుట జరిగినది. ఆనాడు మహిళా ప్రబోధము గావించిన వారిలో చాత్రాతి లక్ష్మీనరసమ్మగారిని ప్రత్యేకముగ పేర్కొన వలసియున్నది.

### ఆంధ్ర మహాసభ అవతరణ

ఆంధ్ర జనసంఘములు ఈ విధముగా అక్కడక్కడ స్థాపితమై కొంత పని చేయుచుండగా "అరువది లక్షలకు మించిన నిజాం రాష్ట్రి ఆంధ్రుల కష్టసుఖములను తెలిసికొనుటకు, వారి సమిష్టి అభిప్రాయమును నిర్మించుటకును" ఒక మహాసభ ఏర్పాటు అవసరమను భావము క్రమ క్రమముగ ప్రచారమయి, తత్ఫలితముగ 3,4,5 మార్చి 1930 తేదీలలో జోగిపేటలో మొట్టమొదటి ఆంధ్రమహాసభ ఏర్పాటు జరిగినది. ఈ మహా సభలకు అధ్యక్షులు శ్రీ శే. సురవరం ప్రతాపరెడ్డిగారు. ఈ మహాసభలకు బహు కష్టము మీద క్రింది షరతుల ప్రకారము అనుమతి లభించినది. (1) అధ్యక్షుడు పరదేశీయుడు కాకూడదు. (గైర్‌ముల్కి) (2) ఇతర మతస్థులకు మనస్తాపముకాని, అనుమానముకాని కలుగు పరిస్థితి కల్పింప కూడదు. (3) రాజకీయాల ప్రసక్తి ఉండకూడదు. ఈ మహాసభతోపాటు మొట్టమొదటి ఆంధ్రమహిళాసభ కూడా జరిగినది. ఈ ఆంధ్ర మహా సభలో వాగ్బంధన శాసనము రద్దు చేయవలెననియు, ప్రాథమిక విద్య నిర్బంధముగ ప్రవేశపెట్టవలెననియు మద్యపాన దురభ్యాసమును పోగొట్ట వలెననియు, రైతులకు కొన్ని అనుకూలములు కల్పించవలెననియు, వెట్టి చాకిరి పోవలెననియును, మహిళా సభలో వివాహ సమస్య, వితంతువుల

స్థితి మొదలగు సమస్యలను గూర్చియు తీర్మానములు జరిగినవి. ఈ తీర్మానాలను పరిశీలించినపుడు ఇవి అన్నియు రాజకీయేతర తీర్మానములే యని స్పష్టము కాగలదు. ఈ విధముగ 1930 నుండి 1946 వరకు పదమూడు ఆంధ్ర మహాసభా సమావేశాలు జరిగినవి. ఈ సమావేశాల వలన అపారమైన ప్రబోధము కలిగినది. మొదటి పది మహాసభలతో పాటు పది మహిళా సభలు కూడ జరిగినవి. ఈ మహాసభలు జరుపుకొనుటకు ప్రభుత్వ అనుమతి తీసికొనుటకై భగీరథ ప్రయత్నాలు జరిపిన నిదర్శనాలు కన్పించుచున్నవి. ఆంధ్రోద్యమము సజీవమైన ప్రజల ఉద్యమముగ అభివృద్ధిచెంది, మహారాష్ట్ర కర్ణాటక ఉద్యమాలకు మార్గదర్శకమై, 1946 తరువాత స్టేటు కాంగ్రెసు ఉద్యమములో లీనమైనది.

## సహజ పరిణామము - అలియావర్జంగ్ అనుమానాలు

ఆంధ్రోద్యమము క్రమక్రమ వ్యాప్తి ప్రభుత్వమునకు అనుమానాలు అధికము కావింపజొచ్చినది. ఈ ఉద్యమ పరిణామము ఆంధ్ర తెలంగాణాల ఏకీకరణగా రూపొందగలదేమోయని 1936 వ సంవత్సరములోనే హైదరాబాదు ప్రభుత్వమునకు అనుమానము కలిగినట్లు అప్పటి హోం సెక్రటరి నవాబ్ అలియావర్జంగ్‌గారు ప్రసంగవశమున నాల్గవ ఆంధ్రమహాసభ అధ్యక్షులైన మాడపాటి హనుమంతరావుగారితో తెలిపినట్లు ఆంధ్రోద్యమ చరిత్రలో గ్రంథస్థము కావింపబడినది. (91 వ పేజీ "తెలంగాణా ఆంధ్రోద్యమము" రెండవ భాగము). ఆనాటి ప్రభుత్వము అనుమానము తుదకు సత్యస్వరూపము దాల్చుట గమనింపదగిన విశేషము.

## రానురాను రాజకీయాలు

మొట్టమొదటి అయిదు ఆంధ్ర మహాసభలు రాజకీయాల జోలికి పోలేదు. ఆంధ్ర మహాసభల సమావేశాలలో వ్యాయామ ప్రదర్శనలు,

నాటక ప్రదర్శనలు, ప్రబోధాత్మకమగు పద్యపఠనము మొదలగు సాంస్కృతిక కార్యకలాపములు ప్రత్యేక స్థానము వహించుచుండెను. ఇట్టి పరిస్థితులలో 1937 వ సంవత్సరమున నిజామాబాదులో జరిగిన ఆంధ్ర మహాసభ ఆరవ సమావేశమునకు చారిత్రాత్మకమగు రాజకీయ ప్రాధాన్యము కలదు ఇందుకు కారణాలు రెండు :

(1) ఆంధ్ర మహాసభలలో తెలుగు మాతృభాష కాని వారు కూడ పాల్గొనుట జరుగుచుండెను అప్పటివరకు "మహాసభ కార్యక్రమము, చర్యలు కవిలె ఆంధ్రభాషయందే జరుగవలె"నను నియమము ఒకటి యుండెను. కాని నిజామాబాదు సభలో కొందరు ఉర్దూభాషలో మాట్లాడుట, దానిపై కొందరు ఆక్షేపణలు తెలుపుట, ఈ ఆక్షేణపలపై తీవ్ర వాదోపవాదములు జరిగి, ఆంధ్ర ప్రాంతమున నివసించు వారందరు వారి మాతృభాష ఏమయినప్పటికి ఆంధ్రులే యనియు, ఆంధ్రభాష మాట్లాడ లేనివారు సభా వేదికనుండి ఇతర భాషలలో మాట్లాడవచ్చుననియు అధిక సంఖ్యాక ప్రతినిధులు నిర్ణయించిరి. మొదటినుండియు ఆంధ్రోద్యమ వ్యాప్తి కుల, మత, వర్గ విచక్షణలకు అతీతముగా జరుగుచుండెను. అందు చేత మహారాష్ట్రులు, కర్ణాటకులు, ముస్లింలు యీ సభలలో పాల్గొని ప్రసంగించుట జరుగుచుండెను. కావున భాషా విషయమై పట్టుదల వహించుట సమంజసము, రాజనీతి కాకుండెను. కుల, మత, వర్గ, భాషావిచక్షణలను పాటింపక నిజాం రాష్ట్రాంధ్ర ప్రాంతమున నివసించు వారందరి అభివృద్ధికై పాటుపడుట యను ఆంధ్రోద్యమము యొక్క విశాల దృక్పథమును అసందిగ్ధముగా స్పష్టీకరించుట యీ సందర్భమున జరిగినది. తత్ఫలితముగ సురవరం ప్రతాపరెడ్డిగారి నాయకత్వమున అసంతృప్తులైన కార్యకర్తలు అభివృద్ధిపక్షము నొకదానిని స్థాపించిరి. కాని ఈ పక్షము చురుకుగా పనిచేసినట్లు అగుపడదు. క్రమక్రమముగ ఆంధ్ర మహాసభ

లలో రాజకీయములు ప్రాధాన్యము వహించి, భాషకు ప్రాధాన్యము తగ్గుట వలన భాషాభిమానులకు కొంత మనస్తాపము, నిస్పృహ కలిగినది. తరువాత మెల్లమెల్లగా ఆంధ్ర భాషాభివృద్ధికి ప్రత్యేక సంస్థ కావలెనను భావము అంకురించి, వ్యాపించెంది, బలపడి 1943 లో హైదరాబాదు నగరమున ఆంధ్ర మహా సభల సందర్భమున ఆంధ్ర సారస్వత సంస్కృతుల అభివృద్ధి ఆశయముతో ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపన జరిగినది. అది యొక ప్రత్యేక చరిత్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆశయాలమీద విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి, ఆంధ్ర జన సంఘ ఆశయాల ప్రభావము స్పష్టముగా కనబడుచున్నదని యీ సందర్భమున గమనించవలసిన సత్యము. రెండవ కారణము ఇంతకన్న ముఖ్యమైనది. ఆంధ్ర మహాసభ కార్యకర్తలలో చాలామంది కాంగ్రెసు భావాలు, జాతీయ భావాలు కలిగి యుండిరి కాని మొట్టమొదటిసారి ఆంధ్ర మహాసభ వేదికనుండి ఈ నిజామాబాదు సమావేశములోనే "బాధ్యతాయుత ప్రభుత్వము" నిజాం రాష్ట్రాంధ్రుల ఆదర్శమని అర్థము నిచ్చు తీర్మానము ఆమోదింపబడినది. ఈ విధముగా ఆంధ్రోద్యమానికి రాజకీయాలతో సంబంధము లేదను పరిస్థితి తొలగిపోయినది. క్రమక్రమముగ బాధ్యతాయుత ప్రభుత్వస్థాపన కృషితో ఆంధ్ర మహాసభలో మితవాద నాయకుల పలుకుబడి తగ్గసాగినది. ఈ సమావేశము తరువాత బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన కొరకు అప్పటి స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహము నడిపినది. ఈ సత్యాగ్రహముతో ఆంధ్ర మహాసభకు ప్రత్యక్ష సంబంధము లేకపోయినప్పటికి ఆంధ్ర మహాసభ కార్యకర్తలు వ్యక్తిగతముగ యీ సత్యాగ్రహములో పాల్గొనిరి. అప్పటి ఆంధ్ర నాయకులలో ప్రముఖులుగా నుండిన రావి నారాయణరెడ్డి, మందుముల రామచంద్రరావు, జమలాపురము కేశవరావుగార్లు సత్యాగ్రహము కావించి జైలుకు పోయిరి. తరువాత 1940 లో జరిగిన మల్కాపురం ఆంధ్ర మహాసభ కూడ రాజకీయముగా

ముఖ్యమైనది. అప్పటి హైదరాబాదు ప్రభుత్వం ప్రవేశపెట్టిన రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరించవలెనను తీర్మానము యీ మహాసభలో అతివాదులైన రావి నారాయణరెడ్డిగారు ప్రవేశపెట్టిరి. దీనిని మితవాదులైన మందుముల నరసింగరావు, మాడపాటి హనుమంతరావు, కొండా వెంకటరంగారెడ్డిగార్లు ప్రతిఘటించిరి అయినప్పటికి తీర్మానము నెగ్గినది. ఈ సందర్భమున "ఏడవ ఆంధ్ర మహాసభ నాటికి యువ నాయకత్వము బలపడినది" అని ఆంధ్రోద్యమ చరిత్రకారులు గ్రంథస్థము కావించి యున్నారు. (తెలంగాణ ఆంధ్రోద్యమము, రెండవ భాగము, పుట 142).

## ఓరుగల్లు మహాసభ - చీలికలు

1942 సంవత్సరము ఓరుగల్లు సమీపమున ధర్మవరము గ్రామమందు జరిగిన ఆంధ్రమహాసభ కూడ రాజకీయముగ చాల ముఖ్యమైనది. ఇందులో రావి నారాయణరెడ్డిగారు క్రొత్త ఆదర్శములచే ప్రేరితులై ముందుకు వచ్చిరని "ఆంధ్రోద్యమ చరిత్రకారులు" వ్రాసియున్నారు. క్రమక్రమముగ ఆంధ్ర మహాసభలో రావి నారాయణరెడ్డి గారొక నూతన వర్గమునకు నాయకత్వము వహించిరి. తత్ఫలితముగా తరువాత జరిగిన సభలలో జాతీయ పక్షము, కమ్యూనిస్టు పక్షము అను రెండు ప్రస్ఫుటమైన వర్గాలు ఏర్పడినవి. భువనగిరిలో జరిగిన పదకొండవ ఆంధ్రమహాసభలో రావి నారాయణరెడ్డిగారి పక్షము ప్రాబల్యము వహించినది. మితవాదులు, జాతీయవాదులు ఇందు పాల్గొనలేదు. భువనగిరి మహాసభ తరువాత ఆంధ్ర మహాసభ రెండు మహాసభలుగా చీలిపోయినది. ఒకటి జాతీయాంధ్ర మహాసభ, రెండవది రావి నారాయణరెడ్డిగారి ప్రాబల్యము కలిగిన ఆంధ్ర మహాసభ. భువనగిరి మహాసభను బహిష్కరించిన ఆంధ్ర నాయకులు 1945వ సంవత్సరమున మడికొండలో మందుముల నరసింగరావుగారి అధ్యక్షతన పండ్రెండవ మహాసభ కావించిరి. ఈ మహాసభకు కొండా

వెంకటరంగారెడ్డిగారు పెట్టని కోటలై యుండిరి. ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారి ఆశీస్సులు ఈ సభకు లభించినవి. బూర్గుల రామకృష్ణారావుగారి సానుభూతి కూడ యీ మహాసభకు లభించినది కీ॥ శే॥ జమలాపురం కేశవరావుగారు కూడ ఈ మహాసభనే బల పర్చిరి. రావి నారాయణరెడ్డి వర్గమువారు పండ్రెండవ ఆంధ్ర మహాసభను ఈ సంవత్సరమే ఖమ్మం పట్టణములో జరిపిరి. ఈ విధముగ ఆంధ్ర మహాసభ రెండుగా చీలిపోయినది. తరువాత 1946 లో జమలాపురం కేశవరావుగారి అధ్యక్షతన పదమూడవ మహాసభ మెదకు జిల్లా యందలి కంది గ్రామమున జరిగినది ఇదియే తుట్టతుది ఆంధ్ర మహాసభ. వైజ్ఞానికోద్యమముగా ప్రారంభమైన ఆంధ్రోద్యమము బాధ్యతాయుత ప్రభుత్వమే తన ఆదర్శముగా నిర్ణయించుకొన్న ఉద్యమముగా పర్యవసించినది. కంది మహాసభ తరువాత ఆంధ్ర మహాసభ స్టేటు కాంగ్రెసులో లీనమయి, స్టేటు కాంగ్రెస్ ఆంధ్ర ప్రాంత సంఘముగ రూపొందినది. ఈ స్టేటు కాంగ్రెస్ ఆంధ్ర ప్రాంత సంఘము మొదటి సమావేశము 1947 లో జడ్చర్లలో జరిగినది. హైదరాబాదులో పోలీసుచర్య జరిగిన తరువాత స్టేటు కాంగ్రెసు హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెసుగా రూపొంది, ప్రత్యేకముగ హైదరాబాదులో ఆంధ్ర ప్రాంతమునకు కాంగ్రెస్ కమిటీ అవకాశము లేకపోయినది.

**మహాసభలు - అధ్యక్షులు**

పదునారు సంవత్సరాల వయస్సు కల్గిన ఆంధ్రోద్యమ చరిత్రలో మొత్తము పదమూడు ఆంధ్ర మహాసభలు జరిగినవి. వీని కధ్యక్షత వహించిన పెద్దలు (1) సురవరం ప్రతాపరెడ్డిగారు, (2) బూర్గుల రామకృష్ణారావుగారు, (3) పులిజాల వెంకటరంగారావుగారు, (4) మాడపాటి హనుమంతరావుగారు, (5) కొండా వెంకటరంగారెడ్డిగారు, (6) మందుముల నరసింగరావుగారు, (7) మందుముల రామచంద్రరావుగారు,

(8) రావి నారాయణరెడ్డి గారు, (9) (అ) మాదిరాజు రామకోటేశ్వరరావు గారు, (ఆ) బద్దం ఎల్లారెడ్డిగారు, (10) జమలాపురం కేశవరావుగారు. వీనితోపాటు జరిగిన పది మహిళా సభలకు నడింపల్లి సుందరమ్మ, టి. వరలక్ష్మమ్మ, ఎల్లాప్రగడ సీతాకుమారి, మాడపాటి మాణిక్యమ్మ, బూర్గుల అనంతలక్ష్మీదేవి, నందగిరి ఇందిరాదేవి, యోగ్యశీలాదేవి, రంగమ్మ ఓబులరెడ్డిగారలు అధ్యక్షత వహించిరి.

### నూతన అధ్యాయము

పోలీసుచర్య తరువాత ఆంధ్రోద్యమములో మరొక అధ్యాయము ప్రారంభమైనది. ఆనాడు 1936 లో అప్పటి హైద్రాబాదు హోం సెక్రటరీ ఆంధ్రోద్యమము ఆంధ్ర-తెలంగాణాల ఏకీకరణ ఉద్యమముగా రూపొంద గలదని వెల్లడించిన అనుమానము పోలీసుచర్య తరువాత సత్యమైనది. పోలీసుచర్య తరువాత ఘనపురంలో జరిగిన హైద్రాబాదు ఆంధ్ర ప్రాంత కాంగ్రెస్ సంఘ సమావేశములో ఆంధ్ర - తెలంగాణాల ఏకీకరణ జరుగ వలెనని తీర్మానించబడినది ఈ తీర్మానమును గోలకొండ మొదలైన తెలుగు పత్రికలు ఆమోదించి హర్షించినవి నిజామాబాదునందు జరిగిన హైద్రాబాదు ప్రదేశ్ కాంగ్రెస్ సమావేశమందు హైద్రాబాదు విభజన జరిగి ఆంధ్ర - తెలంగాణాల ఏకీకరణ జరుగ వలెనని అర్థమునిచ్చు తీర్మానము చేయబడినది. ఈ తీర్మానముచే 2-6-53 హైద్రాబాదు ప్రదేశ్ కాంగ్రెస్ పునరుద్ఘాటించినది. ఈ విధముగ పోలీసుచర్య తరువాత నుండి జూన్ నెల 1954 వరకు హైద్రాబాదు ప్రదేశ్ కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీ మరియు యితర రాజకీయపక్షాలు విశాలాంధ్ర స్థాపనను బలపరచినవి ప్రత్యేకముగ విశాలాంధ్రోద్యమము ప్రారంభ మైనది. విశాలాంధ్ర మహాసభ అవతరించినది.. ఆంధ్ర - తెలంగాణ ఏకీకరణకొఱకు కృషి చేసినది. జూన్ 1954 లో హైద్రాబాదు ప్రదేశ్

కాంగ్రెస్‌లో ఒక వర్గము ప్రత్యేక తెలంగాణా రాష్ట్రము కావలెనను వాదమును లేవదీసినది. తత్ఫలితముగ హైద్రాబాదాంధ్ర రాజకీయ రంగమున విశాలాంధ్రవర్గము, తెలంగాణావర్గము అను రెండు పక్షాలు బయలుదేరినవి. ఉభయపక్షాల వాదనలు భారత ప్రభుత్వమునకు అందజేయబడినవి. హైద్రాబాదు శాసనసభలో అధిక సంఖ్యాకులు విశాలాంధ్రమును బలపర్చినారు. అఖిల భారత కాంగ్రెస్ కార్యవర్గము ఆంధ్ర-తెలంగాణాల ఏకీకరణ జరుగవలెనని సలహా నిచ్చినది. తరువాత హైద్రాబాదు రాజధానిగ ఆంధ్ర-తెలంగాణాల ఏకీకరణ అతిత్వరగా జరిగిన సమగ్ర ఆంధ్ర రాష్ట్రముగా 1956 నవంబరు నెల మొదటి తేదీ నాడు ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగినది. ఇందువలన నూటయేబది సంవత్సరాల క్రింద ఇంగ్లీషు రాజ్యవిస్తరణ ఫలితముగా విడిపోయిన మూడుకోట్ల ఆంధ్రులు తిరిగి ఏకపరిపాలన క్రిందకువచ్చి, కృష్ణా గోదావరినదుల జలాలతోపాటు, తెలుగు సీమలోని ప్రకృతిసంపదను తెలుగు ప్రజల అభ్యుదయము కొరకు వినియోగించి "ఆంధ్రావళికి మోదము" కలుగునటుల సకలాంధ్రము సర్వతోముఖాభివృద్ధి కొరకు ప్రయత్నించు అవకాశాలు లబ్ధమై, విశాలాంధ్రము భారతదేశమునకు పెట్టనికోటయై, ఆసేతుహిమాచలమున ఒక సుందర నందనవనముగా శోభిల్లుచున్నది.

# తెలంగాణములో ఆంధ్ర సారస్వత వికాసము

**(1900 - 1957 మధ్యకాలము)**

ఇరువదియవ శతాబ్దమున మొదటి యర్ధభాగము గడచి, రెండవ యర్ధభాగము ప్రారంభమైనది. ఈ యేబది సంవత్సరాలలో మనదేశమున చరిత్ర నిర్మాణము జరిగినది. ఈ యర్ధశతాబ్దము హైదరాబాదు చరిత్రలో అత్యంత ప్రధానమైన ఘట్టము. మధ్యకాలపు రాజవంశ పరిపాలన అంత మొంది సంపూర్ణ బాధ్యతాయుత పరిపాలన మేర్పడినది. తరువాత రాష్ట్ర విభజన జరిగి ఆంధ్రప్రదేశ్ (విశాలాంధ్రము) అవతరించినది. రాజకీయ ముగా జరిగిన యీ మార్పుల ప్రభావము ఆర్థిక, సాంఘిక, సాహిత్య రంగములందు గూడ గోచరించుచున్నది.

## హైదరాబాదు ప్రత్యేక పరిస్థితులు

హైదరాబాదు రాష్ట్రము ఆనాడు స్వదేశ సంస్థానాలలోనేగాక, వెనుకబడియున్న స్వదేశ సంస్థానాలలో గూడ మొదటిదిగా నుండెను. ఆనాడు ఇక్కడి పరిపాలకులు ప్రజల భాషలయెడ నేమాత్రము సాను భూతి కలిగియుండలేదు. అంతేకాదు, వారి భాషల అభివృద్ధిని వ్యతిరేకించి వాని యభివృద్ధిని సర్వవిధముల నిరోధించిరి. తత్ఫలితముగా తెలుగు సరస్వతికి కొంత కాలము అజ్ఞాతవాసము తప్పలేదు. రాజరాజనరేంద్రుని నుండి రఘునాథరాయల వరకు రాజస్థానాలలో ముత్యాల శాలలందు దీనారటంకాల తీర్థమాడిన ఆంధ్ర శారద, ఉర్దూ, పార్సీ, అరబ్బీ బిబ్బీల వెనుక నెట్టివేయబడి తబ్బిబ్బు జెందినది. అందుచేత హైదరాబాదు రాష్ట్రమున తెలుగు సరస్వతిని అరబ్బీ, పార్సీ సంప్రదాయాలచేత

పరిపోషితమైన ఉర్దూ భాషకు ఊడిగము చేయించు ప్రయత్నాలను ప్రతిఘటించుట భాషాప్రియుల ప్రథమ కర్తవ్యమైనది. ఇండియా యూనియన్‌లో ఇంగ్లీషువారు ఏమి చేసినప్పటికిని సారస్వత సమావేశాలను నిషేధించి ఆంధ్ర భాషావికాసమునకు అడ్డుపడలేదు. రాజకీయాలతో ప్రమేయము లేని వీరేశలింగం ప్రభృతుల నిరంతర కృషికి నిరోధములు కలుగలేదు. హైదరాబాదు రాష్ట్ర ప్రత్యేక పరిస్థితుల ననుసరించి ఆంధ్రగ్రంథ పఠనాసక్తిని విద్యావంతులలో నిలిపియుంచుటయే యొక ఘనకార్యమైనది ఆంధ్ర సారస్వత, సంస్కృతుల వికాసమునకు, అభివృద్ధికి యీ ఘనకార్య సాధనయే ప్రథమ సోపానమైనది. ఈ దృక్పథముతోనే యీ ప్రాంత మందలి తెలుగుభాషా వికాసమును మనము అవలోకించవలసి యుండును.

### ఉర్దూభాషా ప్రభావము

ఆంగ్లభాషా సంపర్కములేని ఉర్దూభాషా ప్రభావమును గూడ మనము గమనించవలసి యున్నది. హైద్రాబాదులో ఉర్దూభాష రాజభాషయై విశ్వవిద్యాలయ బోధనా భాషయై, విద్యాధిక ప్రపంచమున గణుతి కెక్కినది. నలుగురు పెద్దలొక చోట సమావేశమైనచో వారి నాలుకలమీద ఉర్దూ సరస్వతియే నాట్యమాడినది తత్ఫలితముగా విద్యార్థికులలో రెండు భిన్నవర్గా లేర్పడినవి. సంస్కృతాంధ్రములందు పాండిత్యము కలిగి పల్లెటూళ్ళలో నివసించుచు, ఆధునాతన ప్రపంచమునకు దూరముగా నుండి రాజాదరణ లేక, గ్రాసవాసో దైన్యమున కృశించుచుండిన పండిత బృందము మొదటి వర్గము కొలదియో గొప్పయో పరిచయము ఉర్దూ, పార్సీ భాషలతో కలిగి లౌకిక ప్రపంచమున వ్యవహర్తలైన ఆస్తిపరులు రెండవ వర్గము ఆంగ్లభాషతో యీ రెండు వర్గాలకు కూడ సంబంధము అల్పమే. అందుచేత తెలంగాణములోని ఆంధ్రభాష పైన ఆంగ్లభాషా ప్రభావము అలస్యముగా పడినదని చెప్ప

వలసియున్నది. ఉర్దూభాష మరియు ఆంగ్లభాషా ప్రభావాలు పూర్తిగా భిన్నమైనవి. ఉర్దూ వాఙ్మయము పరిమితమైనది. ఆంగ్లవాఙ్మయము అపరిమితమైనది. ఆంగ్లభాషతో పోల్చినప్పుడు ఉర్దూప్రాయము కడు కొద్దిది. ఉర్దూభాష ప్రత్యేకత శృంగారము, సూఫీ తత్వము. ఆంగ్లభాష ప్రపంచ విజ్ఞానమునకు, ప్రపంచ సాహిత్యమునకు ఆటపట్టు. ఉర్దూ అప్పుడప్పుడే పరిపాలకుల భాష యగుటచే ప్రాకులాడు స్థితిలో నుండెను. ఆంగ్లభాష సకల ప్రపంచమునకు వ్యవహారయోగ్యమై, వాడుకలోనికి వచ్చియుండెను. కావుననే ఇండియా యూనియన్‌లో ఆంగ్లభాషవలె అప్పటి హైద్రాబాదు రాష్ట్రములో ఉర్దూభాష పాఠకులను ఉత్తేజితులను జేసి, ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక వాఙ్మయములందు చెప్పదగిన పరిణామాలను కలుగజేయలేకపోయినది. కావున హైద్రాబాదు రాష్ట్రములో ఆంధ్రభాషా వికాసము పూర్వ వాఙ్మయ పఠనము మీదనే యెక్కువ ఆధారపడవలసి వచ్చినది. భావ కవిత్వపు వెల్లువ, నవలా రచనా వ్యాసంగ ప్రవాహము తెలంగాణ క్షేత్రమున తక్కువగా పొంగిపొరలినట్లు కనబడుచున్నది. హైద్రాబాదులో ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసము ముఖ్యముగా నాలుగు మార్గముల జరిగినట్లు స్పష్టము కాగలదు. ఒకటి చరిత్ర పరిశోధన, రెండవది విజ్ఞానవాఙ్మయ నిర్మాణము, మూడవది కథానికా రచన, నాలుగవది ప్రభుత్వమునకు ప్రజలకు మధ్య జరిగిన సంఘర్షణచే ప్రేరితమైన కవితా రచన.

## సంస్థానాల సేవ

తెలంగాణమున ఆంధ్రభాషా వికాసమునకు తోడ్పడిన సంస్థానాధీశ్వరులను యీ సందర్భమున ప్రశంసించవలసియున్నది. ప్రభుత్వ విధానము ప్రజల భాషల అభివృద్ధికి ప్రతికూలముగ నున్న సందర్భమున

నిజాముకు సామంతులై యున్నప్పటికిని గద్వాల, వనపర్తి, అమరచింత మొదలైన సంస్థానాధీశ్వరులు తెలుగు కవులను ఆదరించి, పోషించినారు. ఆధునిక యుగ నిర్మాతలైన తిరుపతి వేంకటకవుల వంటివారు తమ సారస్వత జైత్రయాత్రల సందర్భమున యీ సంస్థానాలకు అరుగుదెంచి సన్మానములను పొందినట్లు "నానారాజ సందర్శనము" తెలుపుచున్నది. ఈ ఆస్థానాలు మినుకుమినుకు మని తెలుగుభాషా దీపములు వెలుగుచున్న ప్రమిదలలో కొంత చమురుపోసి, అవి ఆరిపోకుండునట్లు కాపాడిన గౌరవము సంపాదించుకొనినవి.

### లక్ష్మణరావుగారి లక్ష్యాలు

హైదరాబాదు రాష్ట్రమున ఆంధ్ర సారస్వత వికాసానికి వెలుగు గలదారిని జూపిన విజ్ఞాని ధన్యజీవి కొమర్రాజు వేంకట లక్ష్మణరావు. లక్ష్మణరావుగారు మహారాష్ట్ర దేశమున విద్యాభ్యాసము చేసి, మహారాష్ట్ర భాషలో ప్రావీణ్యము గడించి, అక్కడ జరుగుచున్న వాఙ్మయ కృషిని అవగాహన చేసికొనిన ఆంగ్ల విద్యాధికులు. లక్ష్మణరావుగారు హైద్రాబాదు లోని ప్రత్యేక పరిస్థితులను పరిశీలించి, వాఙ్మయ వికాసానికి మూడు ముఖ్యమైన మార్గములను చూపించినారు. ఒకటి గ్రంథాలయోద్యమము. ఊరూర గ్రంథాలయాలను స్థాపించి, నిరక్షరాస్యత, అజ్ఞానములందు మునిగియున్న ప్రజలకు విజ్ఞానము ప్రసాదించి, మన సాహిత్యపు రుచులను ప్రజలకు తెలియజేయవలసిన ఆవశ్యకతను గ్రహించి లక్ష్మణరావుగారు యీ ఉద్యమానికి బలమైన పునాదులు వేసిరి. స్వయముగా హైదరాబాదులో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము,హనుమకొండలో రాజరాజనరేంద్ర భాషానిలయమును స్థాపించిరి. తరువాత తెలంగాణాలో అనేక గ్రంథా లయాలు అవతరించి, సభలు సమావేశాల ద్వారా మంచి చైతన్యము కలుగచేసి, అనేక యువ రచయితల భావనాశక్తికి దోహదము గావించి

అమోఘమైన సేవ జేసినవి. చరిత్ర, విజ్ఞానము లక్ష్మణరావుగారు అభిమానించిన వాఙ్మయ విశేషములు.

ఈ రెండు మార్గముల రచనలు గావించవలసిన ఆవశ్యకతను లక్ష్మణరావుగారు తెలంగాణా ఆంధ్రులకు తెలియజేసినారు. లక్ష్మణరావుగారి విజ్ఞానచంద్రికా గ్రంథమండలికి హైదరాబాదు జన్మస్థానము చరిత్ర పరిశోధనమున వారి అనుచరులకు, ఏంలవట్టి శిష్యులకు హైదరాబాదు ఆటపట్టయినది. ఈ ముప్పది సంవత్సరాల కాలమున ప్రకటితమయిన గ్రంథజాలమును పరిశీలించినచో వానిమీద విజ్ఞానము చరిత్రల ప్రబల ప్రభావము మనకు వెల్లడికాగలదు లక్ష్మణరావుగారిచే స్థాపితమై, వారి అనంతరము వారి స్మారకార్థము "లక్ష్మణరాయ పరిశోధక మండలి" యను నామకరణము పొందిన పరిశోధనా సంస్థ ఆంధ్రదేశ చరిత్రలో అజ్ఞాతముగానున్న సంగతులను వెల్లడిచేయగల అనేక శాసనాలను వ్యయ ప్రయాసలకోర్చి సేకరించి పరిశోధించి పరిశీలించి తెలంగాణ శాసనములను సంపుటముగా ప్రకటించినది. ఇది ఆంధ్రదేశ మంతయును గర్వించదగిన కృషి, ఆంధ్ర భాషా వికాసమునకు అత్యంత ఉపయుక్తమైన సేవ.

### విజ్ఞాన సంస్థలు వివిధ గ్రంథమాలలు

విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి, తత్ప్రచురణలు అనేక ఇతర గ్రంథమాలల అవతరణకు కారణభూతమైనవి. గోలకొండ, కిన్నెర, దివ్యవాణి, సుకృతి, ప్రసాదము, మాతృభారతి, ఆంధ్రశ్రీ, కాకతీయ, పూలతోట, వీరేశలింగ కవికంఠాభరణ, కృషి ప్రచారిణి, శివధర్మ, విజ్ఞాన ప్రచారణి, వేంకటేశ్వర, కావ్యమాల గ్రంథమాలలను ఈ సందర్భమున పేర్కొనవలసి యున్నది. అణా, దేశోద్ధారక, ఆంధ్రకేసరి గ్రంథమాలలు కొద్దివెలతో ప్రజలకు అవసరమైన విజ్ఞానమును ప్రసాదించు ఉత్తమ వచన గ్రంథములను ప్రకటించినవి సాధన సమితి ఆంగ్ల విద్యాభూషితులయిన

యువకులు స్థాపించి నిర్వహించిన సంస్థ. ఇందులో కథకులు అధిక సంఖ్యాకులు. ఈ సమితి తెలంగాణా రచయితల ఖండకావ్యములను, కథానికలను విరివిగా ప్రకటించి ప్రశంసనీయముగా భాషాసేవ జేసినది. యువకులు నిర్వహించిన మరొక సంస్థ సాహితీ మేఖల. ఆశయము కవితారచన, కావ్య ప్రచారము. ఇందులో కవులు అధిక సంఖ్యాకులు. నూతన భావాలతోపాటు యీ కవులు ప్రబంధముల పక్వతతో కూడిన శైలిని అలవరించుకొనినారు. ఈ యొద్గాణములో పొదిగిన రత్నములు కొన్ని నిజముగా సానలుదీరియున్నవి. ఈ దశాబ్దములోనే అవతరించిన ఆంధ్ర చంద్రికా గ్రంథమాల, విజ్ఞాన వర్ధనీ పరిషత్తులు సరిగా విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ఆశయాలతోనే కృషి చేసి, వివిధ విజ్ఞాన శాఖలకు సంబంధించిన మంచి గ్రంథములను ప్రకటించినవి.

### పత్రికల ప్రశంసనీయ కృషి

భాషావికాసమునకు పత్రికలద్వారా జరిగిన కృషిని ప్రత్యేకముగా పేర్కొనవలసి యున్నది ఇండియన్ యూనియన్‌లోని పత్రికలకున్న స్వాతంత్ర్యములో నూరవ భాగమైనను హైద్రాబాదు పత్రికలకు లేక పోవుట జగత్ప్రసిద్ధమైన సత్యము హైద్రాబాదులోని రచయితలకు తగినంత ప్రచారము కలుగక పోవుటకును, ఇతరాంధ్రదేశ రచయితలతో వారికి పరిచయము కలుగక పోవుటకును పత్రికా స్వాతంత్ర్యము లేకపోవుట ముఖ్యకారణమని చెప్పవచ్చును. అయినప్పటికినీ తీవ్ర ప్రతిబంధకాలను అధిగమించి కొంతకాలమైనను సేవచేసిన పత్రికలు కొన్ని కలవు. వీని పూర్వసంపుటాలను పరిశీలించినచో కథకులకు, కవులకు, వ్యాసకర్తలకు, విమర్శకులకు, పరిశోధకులకు, నాటికా రచయితలకు ప్రోత్సాహము నిచ్చి యీ పత్రికలు భాషా వికాసమునకు తోడ్పడినట్లు విశదము కాగలదు. ఈ పత్రికల కృషి ఫలితముగా ఉన్నతవిద్య నభ్యసించిన యువకులు నూతన రీతుల భాషాసేవకు బద్ధకంకణులైరి. వీరిలో సకలాంధ్ర ప్రశస్తి గాంచిన కథకులు, రచయితలు క్రమముగా సిద్ధమైనారు. గోలకొండ, తెనుగుపత్రిక, నీలగిరి, సుజాత, శోభ, భాగ్యనగర్, సారథి, ఆంధ్రాభ్యుదయము మొదలైన పత్రికలలో ప్రకటితమైన వాఙ్మయము నాటి తెలం

గాణములో జరిగిన భాషా వికాసమునకు మంచి నిదర్శనము ఈ కాలమున ఆంగ్లభాషా పరిచయముతో పాటు ఆంధ్రభాషలో ప్రావీణ్యము సంపాదించిన యువకులు ముందంజవేసి కథలు, గేయాలు, వ్యాసాలు మొదలయినవి వ్యావహారిక భాషలో రచించసాగిరి. హైద్రాబాదు పోలీసు నాజీశక్తుల నగ్న నృత్యము, రజాకార్ల రాక్షస కృత్యములు, నిజాము నిరంకుశ చర్యలు, వానిపైన తిరుగుబాటు యువకుల గేయాలలోను, రచనలలోను శక్తిమంతమైన శైలిలో వ్యక్తీకరించుట జరిగినది. సజీవమయిన భాషలో కండగల కవిత్వమీ సంఘర్షణసాహిత్యమున సమృద్ధిగా అవతరించినది. ఆంధ్ర సారస్వత పరిషత్తు తెలంగాణ మందంతటను శాఖోప శాఖలతో విస్తరించి, వయోజనులకు రాత్రి పాఠశాలలను నిర్వహించి, పరీక్షలను నిర్వహించి, మన భాషలోని మంచి పుస్తకములను ప్రజాసామాన్యముచే పఠింపచేసి, స్వయముగా ప్రజలకు అవసరమైన విజ్ఞాన ప్రదములగు ఉత్తమ గ్రంథములను ప్రకటించి, దేశములో ఒక మంచి సాహిత్య వాతావరణము కలుగచేసి రచనాశక్తికి సర్వవిధముల దోహద మొసగినది.

**విశిష్టమైన ఫక్కీలో తెలుగుభాషా వికాసము**

ఈ విధముగా హైద్రాబాదులో రచనా వ్యాసంగము, ఆంధ్ర భాషా వికాసము ఒక విశిష్టమైన ఫక్కీని జరిగినవి. పరిశోధన, విజ్ఞానము, కథానిక, సంఘర్షణ యుగమునకు సంబంధించిన అభ్యుదయ కవిత్వము, తెలంగాణ రచనలలో ప్రధాన స్థానము నాక్రమించుచున్నవి. ఆంధ్ర భాషకు, ఆంధ్ర సంస్కృతికి కృత్రిమమైన సరిహద్దులు, పొలిమేరలు కల్పించుటకు వీలులేదు. అట్టి ప్రయత్నాలు నెరవేరగల అవకాశాలు అంతరించినవి. సమగ్రాంధ్ర దృక్పథముతో సాహిత్యకృషి జరుగవలసి యున్నది. అట్లు జరుగుచున్నది కూడ. కృష్ణా గోదావరీ తుంగభద్రలు సకలాంధ్రులకు సమష్టిస్వత్వము నన్నయ, తిక్కన, పోతన మొదలగు మహాకవులు వివిధ ప్రాంతాలలో అవతరించి ఆంధ్రభాషను ఆరాధించి నప్పటికిని ఆంధ్రజాతి కంతకు వారు సమానముగా గౌరవపాత్రులై యున్నారు. వారి కృషి సకల ప్రాంతములందలి ఆంధ్రభాష అభ్యుదయమునకు మార్గదర్శకమైనది.

# ఆంధ్ర సాహిత్యము - తెలంగాణము

**'తేనె మాగాణ మీ తెలగాణము'**

ఇరువదవ శతాబ్ద మందలి రెండు తరాలకు జెందిన యిద్దరు ప్రముఖ కవీశ్వరులు తెలంగాణ ప్రశస్తిని కీర్తించినారు. "తేనె మాగాణ మీ తెలగాణము, తమ్ముడా మా తల్లియని పాడరా, సోదరీ మా మాత యని పాడవే!" అని యొకరు ప్రబోధించగా, "నా తెలంగాణ కోటి రత్నాల వీణ" యని ఇంకొకరు ఉద్ఘాటించినారు. ఈ కవీశ్వరులలో ఒకరు భారత జాతీయతను, ఆంధ్రదేశ సంస్కృతిని నోరూర నోరార గానము చేసిన ఆంధ్ర మహాశయులు; ఇంకొకరు యావదాంధ్రము యేకము కావలెనను ఆదర్శముతో "మూడు కోటుల నొక్కటే ముడి బిగించ" వలెనని ఉద్బోధించిన యువకవీశ్వరులు. కావున యీ ఉభయులు తెలంగాణమును కీర్తించుటకు కారణము యేవిధమైన సంకుచిత అభిమానము కాదని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఆంధ్రదేశ చరిత్ర పుటలను అవలోకించినచో చరిత్ర నిర్మాణానికి, సంస్కృతికి, శిల్పమునకు, చిత్రలేఖనమునకు, సాహిత్యమునకు తెలంగాణము ఆదినుండియు ఆటపట్టయినదన్న సత్యము వెల్లడి కాగలదు.

**ఆంధ్ర సాహిత్య చరిత్రలో తెలంగాణ స్థానము**

ఆంధ్ర సాహిత్య చరిత్రలో తెలంగాణమునకు గల స్థాన మేమిటి యను ప్రశ్నకు యీ సందర్భమున సమాధానము చెప్పవలసి యున్నది. దేశచరిత్రలోని ఒడుదొడుకుల ప్రభావము అన్ని ప్రాంతాలమీద పడినట్లే తెలంగాణము మీద కూడ పడినది. కాని యే పరిస్థితులలోను సాహిత్య

దీపము యీ ప్రాంతమున యెన్నడును ఆరిపోలేదు కొంతకాలము యీ జ్యోతి దేదీప్యమానముగా ప్రకాశించినది. మరికొంతకాలము మినుకుమను ఆముదపు దీపమువలె వెలిగినది. ఆంధ్రసాహిత్యములోని ఉద్గ్రంథములను చెప్పవలసినదని యెవరిని కోరినప్పటికిని వెంటనే మూడు గ్రంథాలను సహజముగా పేర్కొనుట అనివార్యము. ఇందులో మొదటిది భారతము; రెండవది భాగవతము; మూడవది రామాయణము. తిక్కన భారతమును నెల్లూరులో రచించినప్పటికిని, దాని ఆవిష్కారణము తెలంగాణలోని యేకశిలా నగరమందలి గణపతి దేవుని యాస్థానమున జరిగినదను సత్యము చరిత్రకారులకు తెలిసియేయున్నది. ఆంధ్రులపాలిటి అమృత మూర్తియైన పోతనామాత్యుడు తెలంగాణ ప్రాంతమందలి ఓరుగల్లు పరిసరములందు నివసించి, భాగవత రచన గావించిన సంగతి చరిత్ర ప్రసిద్ధమైనది. భాగవతమునందలి శిథిలభాగములను పూరణ గావించినవారు తెలంగాణ వాస్తవ్యులైన కవీశ్వరులే. భాస్కర రామాయణమును రచించిన భాస్కరుడు, మల్లికార్జునుడు, కుమార రుద్రదేవుడు, అయ్యలార్యుడు తెలంగాణమున జన్మించిన కవీశ్వరులని వేరుగా చెప్పవలసిన ఆవశ్యకత లేదు. రంగనాథ రామాయణ కృతికర్త రాయచూరు జిల్లా వాస్తవ్యుడు. ఇటీవల వరకు, అనగా 1957 సంవత్సరము వరకు యీ జిల్లా పూర్వపు హైదరాబాదు రాష్ట్రము నంతర్భాగమై యుండెను. ఈ విధముగా భారత, భాగవత, రామాయణాలకు తెలంగాణము పరోక్షముగాను, ప్రత్యక్షముగాను జన్మస్థానమైనది. మారన మహాకవి మార్కండేయ పురాణము తెలంగాణములో ఉద్భవించిన ఉత్తమ సారస్వతములో చేరుచున్నది.

## జానుతెనుగు ప్రజాసాహిత్యము

సాహిత్యము ప్రజలకు అందుబాటులో నుండవలెనను సత్యమును గుర్తించి, జానుతెనుగులో ప్రజాసాహిత్యానికి మిక్కిలి అనుకూలమైన

ద్విపదలో బసవపురాణమును వ్రాసిన పాలకురికి సోమనాథ కవికి జన్మ స్థానము తెలంగాణము ఆంధ్ర సారస్వతములో బసవపురాణము సర్వ విధాల విశిష్టమైన రచన. శైవ వాఙ్మయము తెలంగాణములో ప్రకాశించినది మల్లికార్జున పండితారాధ్యుని శివతత్వసారము, పిడుపర్తి సోమనాథుని బసవపురాణ పద్యకావ్యము ప్రభులింగలీల,కాసె సర్వప్ప రచించిన సిద్ధేశ్వర చరిత్రము యీ శైవ వాఙ్మయమున ప్రత్యేకముగా పేర్కొనదగిన గ్రంథములు. శివకవులతోపాటు వైష్ణవకవుల రచనలకును తెలంగాణము జన్మస్థానమైనది. ముముక్షు జనకల్పకము, తత్వార్థ దర్పణము, యతిరాజవింశతి మొదలైన కావ్యములను రచించిన కవీశ్వరులు యీ ప్రాంతమువారే మేలుకొలుపులు, మంగళహారతులు మొదలైన గేయ వాఙ్మయమును అపారముగా రచించిన వైష్ణవ కవులు యీ ప్రాంతమున అసంఖ్యాకముగా నున్నారు. క్రీస్తు శకము 1700 ప్రాంతమున యేకామ్రనాథుడను పండితుడు ప్రతాప చరిత్రమను వచన గ్రంథమును వ్రాసియుండెను. బహుశా ఆంధ్రభాషలోని మొట్టమొదటి వచన గ్రంథమేమో యిది! తరువాత కొంతకాలానికి అనగా 19వ శతాబ్దమున తెలంగాణములో మరొక మహా గ్రంథము విరచితమైనది. వేదాంత దృష్ట్యా ఆంధ్ర భాషలో యిది అత్యుత్తమ శ్రేణికి చెందిన గ్రంథమైయున్నది. పరశురామ పంతుల లింగమూర్తి వ్రాసిన సీతారామాంజనేయమే యీ వేదాంత గ్రంథమని ఆంధ్ర సారస్వతముతో పరిచయము గలిగిన ప్రతివారును వెంటనే గ్రహించగలరు మొట్టమొదటి అచ్చతెనుగు కావ్యము గూడా యీ ప్రాంతముననే విరచితమైనదని ఆంధ్ర సారస్వత చరిత్ర వివరించుచున్నది. పొన్నగంటి తెలగన్న యయాతి చరిత్రము అచ్చతెనుగు కావ్యాలలో మొదటిదే కాక సర్వోత్తమమైనది కూడ. ఈ విధముగా ప్రాచీనాంధ్ర వాఙ్మయమున తెలంగాణ ప్రాంతమందు మహోజ్వలమైన సారస్వత కృషి జరిగినది. జాను తెనుగు శైలి, ద్విపద ఛందస్సు, ప్రత్యేకముగా అచ్చ

తెనుగు కావ్యరచన, వచనములో చరిత్ర గ్రంథ రచన మొదలైన అనేక వాఙ్మయ వీథులలో మార్గదర్శకమైన గౌరవము తెలంగాణమునకు లభించుచున్నది.

**రాజకీయాల ప్రభావము**

రాజకీయముగా ఆనాడు కలిగిన మార్పుల ఫలితము తెలంగాణము మీద స్పష్టముగా కనిపించుచున్నది. కాకతీయుల పతనానంతరము రెడ్లు, వెలమలు, కమ్మలు ఆంధ్ర దేశమును, తెలంగాణమును పరిపాలించియుండిరి. ఆంతరంగికమైన విభేదాలు యెన్ని యున్నప్పటికిని, ఆంధ్ర భాషా పోషణము వీరి కాలమున చక్కగా జరిగినదని చెప్పవలసియున్నది. తరువాత తెలుగుసీమ కుతుబ్షాహీల హస్తగతమైనది. కుతుబ్షాహీల పరిపాలనలో తెలంగాణమున వైజయంతీ విలాసమును రచించిన సారంగు తమ్మయ్య, యయాతిచరిత్ర కృతికర్త పొన్నగంటి తెలగన్న, షట్చక్రవర్తి చరిత్రను వ్రాసిన మల్లారెడ్డి, తపతీసంవరణోపాఖ్యాన గ్రంథకర్త అద్దంకి గంగాధరకవి మొదలైనవారు ప్రశస్త సారస్వత నిర్మాణము గావించియుండిరి. క్రమక్రమముగా అసఫ్జాహీలకు ఆంధ్రదేశము అధీనమైనది. ఇంతలోనే ఇంగ్లీషువారు తమ సామ్రాజ్యమును విస్తరింపసాగిరి. తత్ఫలితముగా కుతుబ్షాహీల కాలములో ఏకఖండముగా నుండిన తెలుగు సీమ రెండు ప్రాంతాలుగా విడిపోయి, తెలంగాణ ప్రాంతము ఇటీవల వరకు అసఫ్జాహీ వంశీయుల పరిపాలనలో నుండుట జరిగినది (1957 వరకు).

ఈ పరిపాలనలో యీ ప్రాంతమున ఆంధ్ర సారస్వతాభివృద్ధి కుంటుపడినదను సత్యము సుప్రసిద్ధమైనది. పరిపాలకులకు ప్రజల భాష మీద ఆదరము లేకుండెను. వారు అభిమానించిన ఉర్దూ, అరబ్బీ, పారసీల క్రింద తీయనితెలుగు నలిగిపోయినది. ఈ పరిస్థితుల్లో మినుకుమినుకుమని

తెలుగు భాషా దీపములు వెలుగుచుండిన ప్రమిదలలో చమురుపోసి, వానిని ఆరిపోకుండ కాపాడిన గౌరవము వనపర్తి, గద్వాల, ఆత్మకూరు మొదలైన సంస్థానాలకు చెందుచున్నది. కవులను, పండితులను పోషించి, యీ సంస్థానాలు గడచిన రెండు శతాబ్దాలలో తెలంగాణమున ఆంధ్రభాషా పోషణకు చేసిన సహాయము అమూల్యమైనది. ఆధునికాంధ్ర కవులకు గురుపీఠమైన తిరుపతి వేంకటకవులు యీ సంస్థానాలను సందర్శించి, గౌరవాదరాలను పొందియుండిరి. తెలంగాణమందలి సంస్థానాలు ఆంధ్ర భాషకు, ఆంధ్ర సంస్కృతికి గావించిన దోహదము ఒక ప్రత్యేక గ్రంథానికి ఆధార సామగ్రి కాగలిగినదిగా నున్నది. ఈ సందర్భమున ఆధునిక చరిత్ర పరిశోధకులలో అగ్రగణ్యులైన మానవల్లి రామకృష్ణ కవిగారు చిరకాలము వనపర్తిలో ఆస్థాన విద్వాంసులుగా నుండి, ఆ కాలమున అనేక గ్రంథాలను ప్రకటించి, అపారమైన పరిశోధన గావించిన సత్యము ప్రత్యేక స్మరణీయమై యున్నది.

## ఆంధ్ర శారదకు అరణ్య, అజ్ఞాతవాసాలు

మొత్తముమీద గడచిన రెండు శతాబ్దాలలో తెలంగాణములో ఆంధ్ర శారదకు అరణ్యవాస, అజ్ఞాతవాసములు అనివార్యముగా సంప్రాప్తమైనవి. ఇరువదియవ శతాబ్దపు తొలిదశలో హైదరాబాదు రాష్ట్ర ప్రజల విమోచనోద్యమము చట్టబద్ధమైన పద్ధతిలో ప్రారంభమైనది. ఇరుగుపొరుగు రాష్ట్రాలనుంచి స్వాతంత్ర్యోద్యమ వాయువులు మెల్లమెల్లగా హైదరాబాదులో కూడ ప్రవేశించి వీచుట ప్రారంభించినవి. గ్రంథాల యోద్యమముగా ప్రారంభమై, ఆంధ్రోద్యమముగా అభివృద్ధి చెంది, రాజకీయ స్వాతంత్ర్యోద్యమముగా పరిణమించి, హైదరాబాదు రాష్ట్రములో జాతీయో ద్యమముగా వర్ధిల్లినది. ఈ ఉద్యమప్రభావం సారస్వత రంగంమీద సహజ ముగా పడినది. పైన పేర్కొనిన దశలలో కాలానుగుణ్యముగా సారస్వత చైతన్యము వ్యాప్తిచెంది కొంతకాలము నిద్రాణమైన తెలంగాణమును తిరిగి

మేలుకొలిపినది. ఈ పరిస్థితులలో హైదరాబాదు రాష్ట్ర క్షేత్రమున ఆధుని కాంధ్ర వాఙ్మయ వికాసానికి అంకురార్పణ గావించిన గౌరవము కొమ ర్రాజు వేంకట లక్ష్మణరావుగారికి చెందుచున్నది. మహారాష్ట్ర దేశమున విద్యాభ్యాసము గావించి, మహారాష్ట్ర భాషలో ప్రావీణ్యము గడించి, ఆక్కడి వాఙ్మయ కృషిని చక్కగా అవగాహన గావించుకొనిన ఆంగ్ల విద్యా విభూషితులు, సంస్కృతాంధ్ర పండితులు లక్ష్మణరావుగారు. ఆప్పటి హైదరాబాదు రాష్ట్ర పరిస్థితులను గమనించి ఆయన వాఙ్మయ వికాసానికి మూడు ముఖ్యమైన మార్గాలను సూచించినారు. ఇందులో మొదటిది గ్రంథాలయోద్యమము; క్రీ. శ. 1900 సంవత్సరమున లక్ష్మణ రావుగారు హైదరాబాదులో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయమును స్థాపించిరి. తరువాత తెలంగాణములో అనేక గ్రంథాలయాలు స్థాపితమై ఒక్కమారు సారస్వత రంగములో అమోఘమైన జాగృతిని కలిగించి, అనేక రచయితలను ప్రోత్సహించినవి. రెండవది విజ్ఞాన చంద్రికా మండలి స్థాపన హైదరాబాదు నగరములోనే తమకు అత్యంత అభిమానాస్పదమైన చరిత్ర పరిశోధన విజ్ఞానగ్రంథ రచనలను ఆశయములుగా కలిగిన విజ్ఞానచంద్రికా గ్రంథమండలిని లక్ష్మణరావుగారు స్థాపించిరి. విజ్ఞాన చంద్రికా మండలి చూపిన మార్గము ననుసరించి తెలంగాణములో మరి కొన్ని గ్రంథమండలులు స్థాపితమైనవి. మూడవది చరిత్ర పరిశోధన. తమ జీవిత కాలములోనే హైదరాబాదు నగరమున లక్ష్మణరావుగారు స్థాపించిన పరిశోధక మండలి తరువాత లక్ష్మణరాయ పరిశోధక మండ లిగా మారి, శాసనాలను, చరిత్ర సామగ్రిని సేకరించి, రెండు మూడు సంపుటాలను ప్రకటించి అమూల్యమైన కృషి గావించినది.

## తెలుగు సరస్వతికి సేవజేసిన ధన్యులు

ఈ వాతావరణములో ఆంధ్ర భాషా సేవకు కంకణము గట్టుకొని, తమ రచనలతో తెలుగు సరస్వతిని అలంకరించిన మహాశయులలో

మాడపాటి హనుమంతరావుగారిని, ఆదిరాజు వీరభద్రరావుగారిని ప్రత్యేకముగా పేర్కొనవలసియున్నది ఈ ఉభయుల రచనంమీద లక్ష్మణరావుగారి ఆశయాలైన చరిత్ర పరిశోధన విజ్ఞాన వాఙ్మయముల ప్రభావము స్పష్టముగా కనుపించుచున్నది. విశేషించి. ప్రేమ్‌చంద్ కథానికలను తెలుగులోనికి మొట్టమొదటిసారి అనువదించిన గౌరవము హనుమంతరావుగారికి లభించుచున్నది ఈ పరిస్థితులలో మూడు పత్రికలు ఆవిర్భవించి, తెలంగాణములోని రచయితలను ప్రోత్సహించినవి. నల్లగొండ నుండి నీలగిరి అను వారపత్రిక, ఓరుగల్లు జిల్లా ఇనుగుర్తి గ్రామము నుండి తెనుగు వారపత్రిక, హైదరాబాదు నగరమునుండి స్వర్గీయ సురవరము ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వమున గోలకొండ అర్ధవారపత్రిక హైద్రాబాదు రాష్ట్రములోని రచయితల రచనలను ప్రకటించి, కవులకు, పండితులకు, పరిశోధకులకు, విజ్ఞానులకు, రచయితలకు అపారమైన ప్రోత్సాహము నిచ్చి, ప్రజలలో అమోఘమైన సారస్వత ప్రబోధము గావించినవి. తరువాత క్రమక్రమముగా యువకులనేకులు సారస్వత రంగములో ప్రవేశించి, మరికొన్ని పత్రికలను స్థాపించి కొంతకాలము నిర్వహించిరి వీనిలో సుజాత, తెలుగుతల్లి, ఆంధ్రకేసరి, ఆంధ్రాభ్యుదయము, పూలతోట, విభూతి. కిన్నెర, భాగ్యనగర్, దేశబంధు, శోభ మొదలైన మాసపత్రికలు; ఆంధ్రవాణి, సారథి మొదలైన వారపత్రికలును; తెలంగాణ దినపత్రికయు ప్రత్యేకముగా పేర్కొనదగియున్నవి. ఈ పత్రికల సంపుటాలను పరిశీలించినచో కథకులకు, కవులకు, వ్యాసకర్తలకు, విమర్శకులకు, పరిశోధకులకు, నాటికా రచయితలకు ప్రోత్సాహము నిచ్చి భాషావికాసమునకు తోడ్పడినట్లు వెల్లడి కాగలదు. క్రమక్రమముగా కొన్ని సారస్వత సంస్థలు స్థాపితమై పనిజేయసాగినవి. ఆంధ్ర సారస్వత పరిషత్తు, విజ్ఞానవర్ధని పరిషత్తు, ఆంధ్ర చంద్రికా గ్రంథమాల, రచయితల సంఘము, సాధన సమితి, వైతాళిక సమితి ఈ శతాబ్దపు మొదటి

అర్ధభాగములో స్థాపితమై సమావేశాలను జరిపి, గ్రంథాలను ప్రకటించి ప్రశంసనీయమైన భాషాసేవ గావించినవి. ఈ అర్థ శతాబ్దపు వాఙ్మయ మును ఒక్కమారు పరిశీలించినచో, తెలంగాణములో నవ్యసారస్వత వికాసము నాలుగు విధాలుగా జరిగినట్లు విశదము కాగలదు. మొదటిది చరిత్ర పరిశోధన, రెండవది విజ్ఞాన వాఙ్మయ నిర్మాణము; మూడవది కథానికా రచన; నాలుగవది ప్రభుత్వమునకు, ప్రజలకు మధ్య జరిగిన సంఘర్షణ ఫలితమైన కవితా రచన. అందులోనే ఆంధ్రోద్యమ కవిత్వ మును గూడ చేర్చవచ్చును హైదరాబాదులో పోలీసు చర్య జరిగి బాధ్యతాయుత పరిపాలన స్థాపితమై జాతీయ కవులు అఖండాంధ్ర ఆశయ ముచే ప్రబోధితులైనారు. తెలంగాణములోని రచయితలు వివిధ వాఙ్మయ వీథులలో విశేషించి కథానిక, కవిత, వ్యాసరచన రంగాలలో సకలాంధ్ర రచయితలతో సమానముగా ముందంజవేసి ఆంధ్ర సరస్వతిని ఆరాధించి నారు

## అత్యుత్తమ రచనలు

ఈ శతాబ్దపు మొదటి అర్ధభాగములో ప్రకటితమైన కొన్ని గ్రంథాలను ప్రత్యేకముగా ప్రశంసించవలసియున్నది. తెలంగాణ కవుల రచనలను యేరి కూర్చి ప్రకటించిన కావ్య సంపుటము గోలకొండ కవుల సంచిక. ఈ ప్రాంతములోని సాహిత్యమును సకలాంధ్రమునకు పరిచ యము గావించు ఉద్దేశముతో సురవరము ప్రతాపరెడ్డిగారు కవుల రచన లను వారి జీవిత వివరాలతోపాటు సేకరించి ప్రకటించిన కావ్యసంపుటము గోలకొండ కవుల సంచిక. ఆంధ్ర భాషలో వివిధ రచయితల ఖండ కావ్యములను ప్రకటించుటకు చేసిన ప్రథమ ప్రయత్నము ఈ సంపుటమే కావచ్చును. తెలంగాణ ప్రాంతమున ప్రకటితమైన ఉద్గ్రంథాలలో ప్రత్యేక ముగా పేర్కొనదగిన మరొక పుస్తకము ఆంధ్రుల సాంఘిక చరిత్ర. అపార పరిశోధనా ఫలితమై, యీ మార్గమున తెలుగులో ప్రప్రథమ

ప్రచురణయైన యీ చరిత్ర కేంద్ర సాహిత్య అకాడమీ ప్రతి సంవత్సరము ఇచ్చు అయిదు వేల రూపాయల బహుమతిని ఆంధ్ర భాషలో పొందిన మొట్టమొదటి గ్రంథమై యున్నది. నిండు కావ్యములు, ఖండ కావ్యములు, గేయములు, కథానికలు, ఏకాంకికలు, నవలలు, చరిత్ర గ్రంథములు, సారస్వత విమర్శలు అనేకము తెలంగాణమున ప్రకటిత మైనవి. ఇందులో అత్యుత్తమ శ్రేణికి జెందిన సారస్వతముగూడ పుష్కలముగా నున్నది. ఉర్దూ, ఆంగ్ల భాషల ప్రభావము, దేశములో వ్యాప్తి జెందిన వివిధ ఉద్యమాల ప్రభావము యీ వాఙ్మయములో గోచరించు చున్నది.

## సమగ్రాంధ్ర దృక్పథముతో సారస్వత కృషి

ఆంధ్ర భాషకు, ఆంధ్ర సరస్వతికి, కృత్రిమమైన సరిహద్దులను, పొలిమేరలను కల్పించుటకు వీలు లేదు. అట్టి ప్రయత్నాలు విఫలమైనవి; ఆంధ్రప్రదేశ్ యేర్పాటయిన తరువాత సమగ్రాంధ్ర దృక్పథముతో సారస్వత కృషి సమైక్యముగా జరుగుచున్నది. కృష్ణా గోదావరీ నదులు ఆంధ్రమహాజనులందరికి సమష్టి స్వత్వములైనట్లుగానే, నన్నయ,తిక్కన, పోతనాది పూర్వ మహా కవులతోపాటు ఆధునిక మహా రచయితలు వారు ఏ ప్రాంతమున నివసించినప్పటికిని, ఆంధ్రజాతికంతకు సమానముగా ఆదర్శనీయులై యున్నారు. తెలంగాణము, రాయలసీమ, సర్కారు జిల్లాలలో జరిగిన, జరుగుచున్న కృషిని ఆంధ్ర రచయితలు సమిష్టిగా సమీక్షించుకొని ముందడుగు వేయవలసి యున్నది.

# విశాలాంధ్రోద్యమము

## ఆంధ్రావళికి మోదము - చారిత్రాత్మక ప్రకటన

భారత ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ 5 వ మార్చి 1956 నాడు నిజామాబాదులో సుమారు రెండు లక్షల ప్రజలతో కూడిన బ్రహ్మాండమైన బహిరంగ సభలో విశాలాంధ్ర ఏర్పడవలెనని భారత ప్రభుత్వము చేసిన నిర్ణయమును ప్రకటించిన సందర్భము ఆంధ్రదేశ చరిత్రలో చరిత్రాత్మక మైన, మహోజ్వలమైన ఘట్టము. రెండువందల సంవత్సరాల తరువాత తిరిగి తెలుగుప్రజ లందరు రాజకీయముగ ఏక కుటుంబీకులు కాగల అవ కాశము నిచ్చిన భారత ప్రధాని ప్రకటన ఆంధ్రావళికి మోదము చేకూర్చి నది. ఈ ప్రకటన నిజామాబాదున జరుగుటయందు కూడ ఒక విధమైన ఔచిత్యము కన్పించుచున్నది. ఈ నిజామాబాదులోనే పోలీసు చర్యకు చాలా సంవత్సరాలముందు జరిగిన ఆంధ్ర మహాసభ నాలుగవ సమావేశ ములో ఆంధ్రోద్యమము రాజకీయోద్యమముగా రూపొందినది. పోలీసు చర్య తరువాత ఈ నిజామాబాదు పట్టణములోనే జరిగిన హైద్రాబాద్ స్టేట్ కాంగ్రెసు మహాసభలో హైద్రాబాదు విభజన గావించి ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలను పొరుగుననున్న ఆ భాషా రాష్ట్రాలతో కలిపివేయవలెనని తీర్మానించనైనది ఆ నిజామాబాదులోనే 1956 సంవ త్సరమున విశాలాంధ్ర ప్రకటన జరిగినది.

ఇంగ్లీషు సామ్రాజ్య వ్యాప్తితో భారతదేశమున రాష్ట్రాల ఏర్పాటు ప్రజల అవసరాలతో నిమిత్తములేక పరదేశ పరిపాలకుల అవసరాలకు ఉపయోగ పడునట్లుగా జరిగింది. తత్ఫలితముగ కుతుబ్‌షాహీల పాలన మందే కాక నిజామ్‌షాహీల పాలనమందుకూడ కొంతకాలము ఏకముగా నుండిన ఆంధ్రులు మద్రాసు, హైదరాబాదు రాష్ట్రాలలో చీలిపోవుట జరిగి

సది. సుమారు నూటయేబది సంవత్సరాలకు పైగా చీలిపోయిన తరువాత తిరిగి ఏకము కావలెనను అభిలాష 1900 సంవత్సరములో మొట్టమొదట పొడసూపినది. బ్రిటిష్ ఆంధ్రుడైన కీర్తిశేషులగు కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు హైదరాబాదుకు వచ్చి 1900 సంవత్సరములో శ్రీకృష్ణ దేవరాయాంధ్రభాషా నిలయము, 1904 సంవత్సరములో విజ్ఞానచంద్రికా గ్రంథమండలిని స్థాపించి, ఉభయ ప్రాంతాలలో నున్న తెలుగువారిని వైజ్ఞానికముగ దగ్గరకు తీసుకొనివచ్చిరి. ఈ వైజ్ఞానికోద్యమము క్రమ క్రమముగ నాటక ప్రదర్శనాలు, పత్రికలు, వైజ్ఞానికుల పర్యటనలు మొదలైన సాంస్కృతికోద్యమాల ద్వారా వ్యాపించి, బలపడి, పోలీసుచర్య జరిపిన కొన్ని సంవత్సరాలలోనే సాంస్కృతికముగ విశాలాంధ్ర స్థాపన కావించినది. అందుచేతనే తెలంగాణా నాయకులైన కొండా వెంకటరంగా రెడ్డిగారు 1955 జూలై నెలలో జరిగిన తెలుగుభాషా సమితి శాఖ ప్రారంభోత్సవ సమయమున సాంస్కృతికముగ విశాలాంధ్ర ఏర్పడినదని ఉద్ఘాటించిరి. రాజకీయ విశాలాంధ్రకు పూర్వమే సాంస్కృతిక విశాలాంధ్ర ఏర్పడుట సహజము, స్వాభావిక పరిణామము.

## రెండు దశాబ్దాల క్రిందట భావన

రాజకీయముగ విశాలాంధ్రకూడ రెండు దశాబ్దాల క్రిందట భావించిన ఉద్యమమనియే చెప్పవచ్చును. హైదరాబాదులోని ఆంధ్రోద్యమమును గురించి ఇది విశాలాంధ్రోద్యమముగ పరిణమించవచ్చునను అనుమానము ఇరువది సంవత్సరాల క్రిందట అప్పటి హైదారాబాదు ప్రభుత్వమునకు కలిగినది. 1936లో హైదారాబాదు ప్రభుత్వమునకు హోమ్ సెక్రటరీగా నుండిన నవాబ్ అలియావర్ జంగ్ బహద్దూర్ అప్పుడు ఆంధ్రమహాసభ అధ్యక్షులుగా నుండిన మాడపాటి హనుమంతరావు పంతులుగారితో ప్రభుత్వమునకు గల పై అనుమానమును వెల్లడించియుండిరి. 1946వ సంవత్సరములో కామ్రేడ్ పుచ్చపల్లి సుందరయ్యగారు "విశాలాంధ్రలో

ప్రజారాజ్యము" అను పుస్తకమును వ్రాసి, పై అనుమానము సకారణమైన దని నిరూపించియున్నారు. హైదరాబాదులోని సాంస్కృతికోద్యమము విశాలాంధ్రమునకు పునాదులు వేసినది. దేవులపల్లి రామానుజరావు సంపాదకత్వమున 1947 లో ప్రారంభమై వరంగల్లు నుండి వెలువడిన "శోభ" మాస పత్రిక విశాలాంధ్ర దృక్పథముతో నడిచినది.

## రెండు పాయలు

ఈ శతాబ్దమున ఆంధ్రోద్యమము రెండు పాయలుగా అభివృద్ధి పొందినది. ఇందులో మొదటిది మద్రాసు రాష్ట్రములోని ఆంధ్ర రాష్ట్రోద్యమము. మన దేశమున భాషారాష్ట్రోద్యమము భారత జాతీయోద్యమమునకు అనుబంధముగ నిర్వహింపబడినది. భాషారాష్ట్రలను భారతజాతీయ కాంగ్రెసు స్వాతంత్ర్యమునకు పూర్వమే బలపరచి తన రాష్ట్ర కాంగ్రెసు సంఘాలను ఈ ప్రాతిపదికమీదనే నిర్మించినది. భారతదేశమునకు స్వాతంత్ర్యము రాకపూర్వము మద్రాసు రాష్ట్రములోని ఆంధ్రోద్యమము ఆ రాష్ట్రములోని ఆంధ్ర ప్రాంతమునకు మాత్రమే పరిమితమైన రాష్ట్రోద్యమముగ నుండెను. రెండవ పాయ హైదరాబాదులోని ఆంధ్రోద్యమము. ఈ ఉద్యమము యొక్క లక్ష్యము పోలీసుచర్యకు పూర్వము వరకు హైదరాబాదులో బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనయై యుండెను. కాని భారతదేశమునకు స్వాతంత్ర్యము ప్రాప్తించి స్వదేశ సంస్థానాలు స్వతంత్ర భారతమునందలి అంతర్భాగాలైన తరువాత ఉభయప్రాంతాలలోని ఆంధ్రోద్యమ దృక్పథములో స్పష్టమైన, సహజమైన పరిణామాలు కన్పించినవి. ఈ పరిణామమే తిరిగి ఆంధ్రులందరు ఏక రాష్ట్రవాసులు కావలెనను ఉద్యమముగ రూపొందినది. ఇటువంటివే సంయుక్త మహారాష్ట్ర, ఐక్య కర్ణాటక ఉద్యమాలు. కావుననే మైసూరు, హైద్రాబాదు రాష్ట్రలు స్వతంత్ర భారత

యూనియన్‌లో చేరిన తరువాత 26 వ నవంబరు 1949 వ సంవత్సరమున విశాలాంధ్ర మహాసభ స్థాపన జరిగినది. ఈ మహాసభ తరువాత 1950 ఫిబ్రవరి 13, 14 తేదీలలో సమావేశమై, విశాలాంధ్ర తన ఆదర్శముగ ప్రకటించినది. 1953 అక్టోబరు 2వ తేదినాడు మద్రాసు రాష్ట్ర విభజన, అక్కడి తెనుగు ప్రాంతాలతో కూడిన ఆంధ్రరాష్ట్ర స్థాపన జరిగినది. ఇది విశాలాంధ్ర రాష్ట్రస్థాపనకు తెలిమెట్టు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రము కావలెననియు, మద్రాసు నుండి విడిపోవలెననియు అభిప్రాయము మొట్టమొదటిసారి 1912లో కలిగినది. తమిళులతో కూడిన మద్రాసు రాష్ట్రములో ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి సరియైన అవకాశాలు దొరకకపోవుటే ఈ అభిప్రాయానికి మూలము. ఆంధ్రరాష్ట్రోద్యమమును ప్రారంభించి దానికి నాయకత్వము వహించినది స్వర్గీయ కొండా వెంకటప్పయ్య పంతులు, స్వర్గీయ నాగేశ్వరరావు పంతులు, స్వర్గీయ న్యాయపతి సుబ్బారావు పంతులు, స్వర్గీయ కట్టమంచి రామలింగారెడ్డి గారలతోపాటు, స్వర్గీయులు ప్రకాశం పంతులుగారు, బులుసు సాంబమూర్తిగారు, పట్టాభి సీతారామయ్య పంతులుగారు మొదలైన పెద్దలు. మొట్టమొదట భాషా రాష్ట్రవాదము కాంగ్రెసు వర్గాలలో కొంత అలజడిని కల్గించినది. భాషారాష్ట్రాల ఆవశ్యకతను గూర్చి ఇంగ్లీషులో ఒక ఉద్గ్రంథమును వ్రాసి, భాషారాష్ట్ర వాదమును పట్టాభి సీతారామయ్యగారు సహేతుకముగ సమర్థించిరి. ఆంధ్ర కాంగ్రెసు నాయకులు అఖిల భారత కాంగ్రెసుచే భాషా రాష్ట్రాల సూత్రమును ఆమోదింపచేసి, మద్రాసు రాష్ట్రములోని ఆంధ్ర ప్రాంతానికి ప్రత్యేక కాంగ్రెసు సంఘమును సాధించిరి. తరువాత క్రమ క్రమముగ ఆంధ్ర రాష్ట్రోద్యమము బలపడి, మనకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత ఆంధ్రరాష్ట్రము ఏర్పడినది. ఆంధ్రరాష్ట్రోద్యమమును గూర్చి ఆంధ్రదేశములో ఎటువంటి అభిప్రాయ భేదము లేకుండెను. అన్ని రాజకీయపక్షాలీ ఉద్యమమును సమర్థించినవి. మద్రాసులో జరిగిన

ఇరువదవ ఆంధ్రమహాసభ సమావేశానికి ఆచార్య రాధాకృష్ణగారు అధ్యక్షత వహించిరి. తరువాత వారు ఇంగ్లాండు వెళ్ళి, ఆంధ్రరాష్ట్ర స్థాపన గూర్చి సెక్రటరీ ఆఫ్ స్టేట్స్‌తో సంప్రదింపులు కూడ జరిపిరి. మొదటినుండియు ఆంధ్రోద్యమము పట్ల సంపూర్ణమైన సానుభూతిని కలిగి రాధాకృష్ణ గారు అవసరమైనపుడు తగిన సహాయమును చేసినారు.

## విమోచన ఉద్యమము

భారత దేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత హైదరాబాదు ప్రజలయొక్క విమోచనోద్యమానికి క్రొత్త బలము చేకూరినది. భారత యూనియన్‌లో ప్రవేశించుటకు హైదరాబాదు నిజామ్ నిరాకరించుటతో హైదరాబాదు ప్రజల విముక్తి ఉద్యమములో నూతనాధ్యాయము ప్రారంభమైనది. 1947 లో చెలరేగిన రజాకారు అమానుష చర్యల ఫలితముగ హైదరాబాదు ప్రజలు వేల సంఖ్యలో పొరుగు రాష్ట్రాలకు తాత్కాలికముగా వలస పోయిరి. హైదరాబాదాంధ్రులు విజయవాడ, కర్నూలు ప్రాంతాలకు వెళ్ళిరి. ఈ వెళ్ళుటలో ఉభయ ప్రాంతాల రాజకీయ సమైక్యత యొక్క మనస్తత్వము వెల్లడియగుచున్నది. 1947 జులైలో విజయవాడ యందు అయ్యదేవర కాళేశ్వరరావుగారి యింటిలో స్వామీ రామానందతీర్థ అధ్యక్షతన ఇట్లు తాత్కాలికముగ వలసపోయిన రాజకీయ కార్యకర్తల సమావేశము జరిగి, హైద్రాబాదు ప్రజల స్వాతంత్ర్య పోరాట చర్యా సంఘము స్థాపితమైనది. దీని శాఖ యొకటి కర్నూలులో స్థాపితమైనది. ఈ చర్యా సంఘము పక్షాన మాట్లాడుచు, హైద్రాబాదులో ప్రజలకు ఫాసిస్టు పరిపాలననుండి విముక్తికలిగి బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన జరుగవలెనని స్వామి రామానందతీర్థ ఉద్ఘాటించిరి. ఇదే నెలలో మద్రాసు రాష్ట్రము లోని ఆంధ్ర కాంగ్రెసు సంఘమువారు హైద్రాబాదు ప్రజల సహాయ సంఘము నొకదానిని కాళేశ్వరరావుగారి అధ్యక్షతన నెలకొల్పిరి.

### పోలీసు చర్య

1948 ఏప్రిల్ 26 నాడు బొంబాయిలో రాజేంద్రబాబుగారి అధ్యక్ష తన అఖిల భారత కాంగ్రెసు స్థాయీ సంఘ రహస్య సమావేశము జరిగి నది. దీనికి హైద్రాబాదు కాంగ్రెసు నాయకులుకూడ వెళ్ళియుండిరి. ఈ రహస్య సమావేశములో హైద్రాబాదుపై పోలీసుచర్య జరపవలెనని వాదిం చిన వారిలో కాశీశ్వరరావుగారు ముఖ్యులు. ఈ సందర్భమున ఆంధ్ర రాష్ట్రము కావలెనని ఆంధ్ర నాయకులు రాజేంద్రబాబును కోరగా, వారు ఆంధ్రులకు మాత్రమే వెంటనే రాష్ట్రము నిచ్చుటకు నిర్ణయించినచో మహారాష్ట్ర, కర్ణాటకులకు కూడ ఈయవలసి యుండుననియు, ఈ అన్ని సమస్యలు ఒకేసారి నిర్ణయించుట మంచిదని తెలిపిరి. మొత్తముమీద 13 సెప్టెంబరు నుండి 17 సెప్టెంబరు (1948) వరకు హైద్రాబాదుపై పోలీసు చర్య జరిగి ప్రజల విముక్తి జరిగినవి. 1948 నవంబరులో హైద్రాబాదుకు కాశీశ్వరరావుగారు వచ్చి, స్థానిక కాంగ్రెసు నాయకులైన స్వామీజీ మొద లైన వారితో సంప్రదించిరి. ఆ సందర్భంలో హైదరాబాదు విభజన జరిగి, విశాలాంధ్ర, ఐక్యకర్ణాటక, సంయుక్త మహారాష్ట్రల కొరకు పనిచేయ వలెనని నిర్ణయింపబడింది. 1949 ఏప్రిల్‌లో తిరిగి కాశీశ్వరరావుగారు హైదరాబాదుకు వచ్చినపుడు హైదరాబాదు తెలుగు నగరమనియు, అది తెలుగు సీమకు రాజధాని యనియు మహారాష్ట్ర నాయకులు ఒప్పుకొని ఉద్ఘాటించుట జరిగినది. ఆ సమయమున రామకృష్ణారావుగారిచ్చిన తేనీటి విందు సందర్భమునకూడ హైద్రాబాదు సకలాంధ్రమునకు రాజధాని యని అందరు ఒప్పుకొనుట జరిగినది. సకలాంధ్రమునకు హైద్రాబాదు రాజధానియని వ్యాపించుచున్న భావము సర్దారు పటేలుగారి దృష్టికి ఎట్టులో తీసుకొని రాబడినది. అపుడాయన ఈ విషయమై కాశీశ్వరరావు గారికి వ్రాసిన ఉత్తరములో ఇప్పుడే హైద్రాబాదు విభజనను గూర్చిన ఆందోళన చేయవద్దని హెచ్చరించిరి. తరువాత 1949 మే నెలలో దేహ

రాడూన్‌లో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశ సందర్భ మున హైద్రాబాదు కాంగ్రెసు నాయకులతో మాట్లాడుచు సర్దార్ పటేల్ గారు హైద్రాబాదు విభజనను గూర్చి ఆందోళన చేయు సమయము ఆస న్నము కాలేదనియు, ఒక అయిదు సంవత్సరాల కాలమున ఈ పని జరు గుటకు తగిన వాతావరణము సృష్టింప బడగలదనియు తెలిపిరి. ఈ విధ ముగ, తరువాత హైద్రాబాదు విభజనోద్యమమునకు తగిన వాతావరణము కల్గించబడినది. హైద్రాబాదు సకలాంధ్రమునకు రాజధానియని కూడ గుర్తించబడినది. ఇట్లు గుర్తించిన అప్పటి మద్రాసు ఆంధ్ర కాంగ్రెసు నాయకులలో మొదటివారు కాశేశ్వరరావుగారు. మద్రాసు ఆంధ్రులకు లభించదని వీరు మొదటి నుండియు అభిప్రాయపడిరి. జనవరి 1950 లో మద్రాసులో సమావేశమయిన ఆంధ్ర కాంగ్రెసు శాసన సభ్యులు కర్నూలు ఆంధ్రుల తాత్కాలిక రాజధానియని, హైద్రాబాదు శాశ్వత రాజధాని యనియు నిర్ణయించుట గమనింపదగిన విశేషము. ఆంధ్రరాష్ట్ర అవతరణ మునకు ఒక రోజు ముందు అనగా 30 వ సెప్టెంబరు 1953 నాడు సమా వేశమైన ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘమువారుకూడ కర్నూలు తాత్కా లిక రాజధాని, హైద్రాబాదు శాశ్వత రాజధానియని నిర్ణయించిరి. కమ్యూ నిస్టు పార్టీవారు మొదటి నుండియు, అనగా 1947 వ సంవత్సరము నుండియు హైదరాబాదు సంస్థానమును విచ్ఛిన్నము గావించి, మదరాసు రాష్ట్రములోని ఆంధ్ర ప్రాంతమును తెలంగాణముతో కలిపివేసి విశా లాంధ్రమును హైదరాబాదు రాజధానిగా యేర్పాటు చేయుట తమ ఆశయ మని ఉద్ఘాటించుచు, యీ ఉద్యమము జనసామాన్యములో వ్యాపించుటకు కృషి సల్పుచుండిరి.

### కృత్రిమ రాష్ట్రము - ప్రజల ఆకాంక్ష

ఇంగ్లీషువారి రాజ్యవిస్తరణ ఫలితముగ ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటకములతో కూడిన యొక కృత్రిమ రాష్ట్రము అసఫ్జాహి పరిపాలన

క్రింద ఏర్పడినది. మధ్యయుగములో నిరంకుశ పరిపాలనక్రింద ప్రజలు నలిగిపోయినారు. పోలీసుచర్య తరువాత ఏర్పడిన ప్రజాస్వామిక వాతావరణమున హైద్రాబాదు విభజన జరిగి ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలు పొరుగు రాష్ట్రంలోని ఆయా భాషాప్రాంతాలతో కలిసి విశాలాంధ్ర, సంయుక్త మహారాష్ట్ర, ఐక్య కర్ణాటకములు ఏర్పడవలెనని ప్రజలు ఆకాంక్షించినారు. ఈ ఆకాంక్ష పోలీసు చర్య తరువాత హైద్రాబాదు రాష్ట్రములోని అన్ని రాజకీయపక్షాల తీర్మానాలయందు ప్రతిబింబితమైనది. సాంస్కృతిక సంస్థలు యీ అభిప్రాయములను బలపరచినవి పోలీసు చర్య తరువాత తూప్రాన్‌లో జరిగిన ఆంధ్ర సారస్వత పరిషత్తు 1949 ఫిబ్రవరి సమావేశములో భాషా రాష్ట్రాలను బలపరచుటయే కాక అది వాస్తవముగా విశాలాంధ్ర సారస్వత సమావేశముగ జరిగినది. తరువాత పరిషత్తు సభలు యీ మార్గముననే నడచినవి. అలంపురములో రాధాకృష్ణ పండితుని ఆశీర్వచనములతో ప్రారంభమైన ఆంధ్ర సారస్వత పరిషత్ సభలు వాస్తవముగ సకలాంధ్ర సారస్వత సభలు. ఆంధ్ర సారస్వత పరిషత్తు, ఇతర సారస్వత సంస్థలు విశాలాంధ్రోద్యమమును సంపూర్ణముగ బలపరచినవి. పోలీసు చర్య జరిగిన వెంటనే కీ. శే. సర్దారు జమలాపురం కేశవరావుగారి అధ్యక్షతన ఘణపురంలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సమావేశములో విశాలాంధ్ర కావలెనని ఉద్ఘాటించు తీర్మానము ఆమోదింపబడినది. ఈ తీర్మానమును అప్పటి తెలంగాణా ఏకైక దినపత్రికయగు గోలకొండ సంపాదకీయమున బలపరిచింది. రాజకీయముగ, ఒక బహిరంగ సభలో ఇట్టి ఉద్ఘాటన జరుగుట బహుశా ఇదియే మొదటి పర్యాయమేమో! నిజామాబాదులో 1950 మార్చి నెలలో శ్రీ దిగంబరరావు బిందూ అధ్యక్షతన జరిగిన హైద్రాబాదు స్టేటు కాంగ్రెసు సమావేశమున హైద్రాబాదు రాష్ట్రమును విభజించి ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలను తత్పరిసర భాషా ప్రాంతాలతో కలిపి

వేయవలెనని తీర్మానింపబడినది. ఈ తీర్మానమును ప్రతిపాదించినవారు బూర్గుల రామకృష్ణారావుగారు. ఈ తీర్మానమునకు రంగారెడ్డి, చెన్నారెడ్డి గారల ఆమోదము కూడ లభించెను. 1950 వ సంవత్సరమున ఫిబ్రవరి 12, 13 తేదీలలో వరంగల్లులో అయ్యదేవర కాళేశ్వరరావు అధ్యక్షతన జరిగిన విశాలాంధ్ర మహాసభ స్థాయీ సంఘ సమావేశములో విశాలాంధ్ర తీర్మానము ఆమోదించుట జరిగినది. ఈ సమావేశములో ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు పాల్గొనిరి. ఈ విశాలాంధ్ర స్థాయీ సంఘ సభ్యుల పట్టికను పరిశీలించినపుడు ఇందులో అన్ని రాజకీయ పక్షాల ప్రతినిధులు, అన్ని వర్గాల ప్రతినిధులు, సాంస్కృతిక సంస్థల ప్రతినిధులు కనిపించుచున్నారు. కాంగ్రెస్సే కాక ఇతర రాజకీయ పక్షాలు కూడా, ముఖ్యముగా కమ్యూనిస్టు, సోషలిస్టు పక్షాలు విశాలాంధ్రోద్యమానికి ఎంతో బలమును చేకూర్చినవి.

### కొంతకాలము పట్టినది

ఈ విధముగ ప్రారంభమైన విశాలాంధ్రోద్యమము హైదరాబాదు నగరములో అడుగుపెట్టి, తెలుగు సీమలో వ్యాపించుటకు కొంతకాలము పట్టినది. ఉస్మానియా విశ్వవిద్యాలయమున జరిగిన మొట్టమొదటి ఆంధ్రాభ్యుదయోత్సవాల సందర్భమున అయ్యదేవర కాళేశ్వరరావుగారు హైదరాబాదుకు వచ్చి, విశాలాంధ్ర మహాసభను మాడపాటి హనుమంతరావు పంతులుగారి సలహాతో ప్రారంభించుటకు ప్రయత్నించిరి. ఈ సందర్భమున సుల్తాను బజారులోని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యాలయమున ఇందు కొరకై ఒక సమావేశము జరిగియుండెను. ఆ సమావేశానికి అపుడు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకు ఉపాధ్యక్షులుగానున్న పల్లెర్ల హనుమంతరావు గారు అధ్యక్షత వహించిరి. సమావేశములో మాడపాటి హనుమంతరావు పంతులు, అయ్యదేవర కాళేశ్వరరావు, పి. పుల్లారెడ్డి, దేవులపల్లి రామానుజ

రావు, పులిజాల హనుమంతరావు, యం. యస్. రాజలింగం మొదలైన వారు పాల్గొని, కొంతకాలము ఆగి ఈ ఉద్యమమును ప్రారంభింపవలెనని అభిప్రాయపడిరి.

**అంకురార్పణ - ప్రజాస్వామిక వాతావరణము**

ఇట్టి పరిస్థితులలో హైద్రాబాదు రాష్ట్రమున జనరల్ ఎన్నికలు జరిగినవి. మొట్టమొదటిసారిగా శాసనసభకు బాధ్యతవహించు ప్రభుత్వము ఏర్పడినది. కమ్యూనిస్టులు తెలంగాణ పోరాటమును విరమించి శాసన సభలో ప్రవేశించిరి. ఈ ప్రజాస్వామిక వాతావరణములో విశాలాంధ్రోద్యమ వ్యాప్తికి తగిన తరుణము ఆసన్నమైనదని ఉద్యమాభిమానులు అభిప్రాయపడినారు. ఈ అభిప్రాయముతో ఉస్మానియా విశ్వవిద్యాలయ పట్టభద్రుల కార్యాలయమున మీర్ అహమ్మదలీఖాన్ గారి ప్రేరణతో మీర్ అహమ్మదలీఖాన్, దేవులపల్లి రామానుజరావు, నందగిరి వెంకట్రావు గారలు 13 ఆగస్టు, 1953 నాడు సమావేశమై, హైదరాబాదు రాష్ట్రములో విశాలాంధ్రోద్యమము ప్రారంభింపవలెనని నిర్ణయించి, మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి గారలతో సంప్రదింపవలెనని నిశ్చయించిరి. ఈ సంప్రదింపులు 20 ఆగస్టు 1953 నాడు ఎగ్జిబిషను గ్రౌండ్సులోని ఉస్మానియా విశ్వవిద్యాలయ పట్టభద్రుల కార్యాలయములో జరిగినవి. ఈ సంప్రదింపులలో మాడపాటి హనుమంతరావు, అహమ్మదలీఖాన్, సురవరం ప్రతాపరెడ్డి, నందగిరి వెంకట్రావు, దేవులపల్లి రామానుజరావు, పల్లెర్ల హనుమంతరావు, సర్దారుల్లాఖాన్, భోజరాజ్ గారలు పాల్గొని యుండిరి. ఆనాడు ఈ ఎనిమిది మంది సంతకాలతో 1953 సెప్టెంబరు 14 వ తేదీనాడు సాయంకాలం 5 గంటలకు పట్టభద్రుల కార్యాలయములో ఒక పెద్ద సమావేశమును జరుపుటకు నిర్ణయించబడినది. ఆ సమావేశమునకు నగరమునుండి, జిల్లాలనుండి నూరుమందికిపైగా ప్రతి

నిధులు ఆహ్వానింపబడిరి. సమావేశపు నోటీసు సురవరం ప్రతాపరెడ్డిగారు ఇంగ్లీషులో వ్రాసిరి. 14 సెప్టెంబరు 53 నాటి సమావేశమున మాడపాటి హనుమంతరావు, పల్లెర్ల హనుమంతరావు, భోజరాజ్, బొజ్జం నరసింహులు, కొమ్మపరపు సుబ్బారావు, ఆదిరాజు వీరభద్రరావు, యస్. శ్యామరావు, కమతం వెంకటరెడ్డి, మీర్ అహమ్మదలీ ఖాన్, దేవులపల్లి రామానుజరావు, సర్దారుల్లాఖాన్, మడూరి శంకరలింగం, రంజిత్ సింగ్, భద్రదేవ్, నూకల నరోత్తమరెడ్డిగారలు పాల్గొనిరి. మాడపాటి హనుమంతరావుగారు ఈ సమావేశమునకు అధ్యక్షత వహించిరి. ఈ విధముగ హైదరాబాదు నగరమున, జిల్లాలలో విశాలాంధ్రోద్యమ అభిప్రాయాలు క్రమక్రమముగ వ్యాపింపసాగినవి. విశాలాంధ్ర మహాసభను స్థాపింపవలెనని అభిప్రాయములు బలపడినవి. ఇవి ఇట్లుండగా మద్రాసులో ఆంధ్రరాష్ట్రముకొరకు పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణము తరువాత భారత ప్రభుత్వముచే ఆంధ్రరాష్ట్ర స్థాపన ప్రకటన జరిగినది. ఈ పరిస్థితిలో 1953 ఏప్రిల్ నెలలో విజయవాడయందు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటీ కార్యనిర్వాహక వర్గ సమావేశము జరిగియుండెను. ఈ సమావేశము మిక్కిలి ముఖ్యమైనది. అప్పుడు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘానికి సంజీవరెడ్డిగారు అధ్యక్షులుగా నుండిరి. ఈ సందర్భమున తెలంగాణా ప్రతినిధులు కొందరు విజయవాడకు వచ్చిన బాగుండునని కాళేశ్వరరావుగారు మాడపాటి హనుమంతరావు పంతులుగారికి వ్రాసిరి. మాడపాటి హనుమంతరావుగారు తమ అంతరంగికులను సంప్రదించి, అహమ్మదలీఖాన్, దేవులపల్లి రామానుజరావులను విజయవాడకు వెళ్ళమని కోరిరి. వీరి విజయవాడకు వెళ్ళకమందు కొండా వెంకటరంగారెడ్డిగారిని కలుసుకొనిరి. రంగారెడ్డిగారు కొంత ముందుగానో, ఆలస్యముగనో, అనివార్యముగ విశాలాంధ్ర ఏర్పడగలదనియు, ఈ విషయమై తమను కలుసుకొనిన ముగ్గురు, అనగా మాడపాటి హనుమంతరావు, అహమ్మదలీ

ఖాన్, దేవులపల్లి రామానుజరావుగారలు పనిచేయుట తమకు సమ్మతమేనని ప్రోత్సహించిరి. విజయవాడలో ఈ ఉభయులకు ఘన స్వాగత మీయబడి నది. అక్కడ ఈ ఉభయులు సంజీవరెడ్డి, కాళేశ్వరరావు మొదలయిన కాంగ్రెస్ నాయకులతో సంప్రదించిరి. ఆంధ్రనాయకులు విశాలాంధ్రకు తమ సంపూర్ణ సుముఖత్వమును వెల్లడించి, విశాలాంధ్ర ఉద్యమము తెలంగాణమునుండియే సాగవలెనని అభిప్రాయపడిరి. ఆనాడు విజయవాడలో యీ విషయమై జరిగిన బహిరంగసభలో పై ఉభయులు ప్రసంగించిరి. దీని తరువాత హైద్రాబాదు, సికింద్రాబాదు మ్యునిసిపల్ కార్పొరేషనులు హైద్రా బాదు రాష్ట్ర విభజన జరిగి, హైద్రాబాదు రాజధానిగ విశాలాంధ్ర ఏర్పడ వలెనని తీర్మానించినవి. 2 వ జూన్ 1953 నాడు హైద్రాబాదులో హైదరా బాదు ప్రదేశ్ కాంగ్రెసు సర్వసభ్య సమావేశము రామానందతీర్థ అధ్యక్ష తన జరిగినది. అందులో విశాలాంధ్ర ఐక్యకర్ణాటక, సంయుక్త మహారాష్ట్ర ముల స్థాపన వాంఛించుచు తీర్మానము జరిగినది. ఈ సంఘటనలు హైదరా బాదు, సికింద్రాబాదు నగరాలలోను తెలంగాణా జిల్లాలలోను విశాలాంధ్రోద్యమ వ్యాప్తికి బలమైన ఊతనిచ్చినవి. కమ్యూనిస్టు పార్టీ విశాలాంధ్రను బలపరు చుచు ప్రకటన గావించినది. 1953 ఆగస్టు 14, 15 తేదీలలో హిమాయత్ నగర్‌లో తెలంగాణా రైతుసంఘ కార్యాలయమున బద్దం ఎల్లారెడ్డిగారి అధ్యక్షతన జరిగిన ఆంధ్ర మహాసభ కార్యవర్గ సమావేశములో విశా లాంధ్ర కావలెనను తీర్మానము ఆమోదింపబడినది. తరువాత కొన్నినెలలకు ఈ ఆంధ్రమహాసభ సమావేశము ప్రతాపగిర్జి కోఠిలో జరిగినది. విశా లాంధ్రము సత్వరముగా ఏర్పడవలెనని తీర్మానింపబడినది. 1953 ఆగష్టు 24 వ తేదీనాడు రెడ్డి విద్యార్థి వసతి గృహమున విశాలాంధ్రోద్యమమును బలపరచుటకై మాడపాటి హనుమంతరావుగారి అధ్యక్షతన ఒక సమా వేశము జరిగినది. ఇందులో దేవులపల్లి రామానుజరావు, ఎ బి. రాజు, గురుమూర్తి, వెంకటేశం, వాసుదేవనాయక్, అహమ్మదలీఖాన్, సర్దారుల్లా

ఖాన్, డాక్టరు రంగాచారిగార్లు విశాలాంధ్ర నిర్మాణము తొందరగా జరుగవలెనని ఉపన్యసించిరి. 1953 అక్టోబరు 2 వ తేదీన ఆంధ్రరాష్ట్ర స్థాపన జరిగినది. ఈ సందర్భమున కర్నూలులో జరిగిన ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సమావేశమున హైదరాబాదు రాజధానిగ విశాలాంధ్ర స్థాపన జరుగవలెనని తీర్మానింపబడినది. ఇది గమనించదగినది. ఆంధ్ర రాష్ట్రావతరణ ఉత్సవాలలో పాల్గొనుటకు హైద్రాబాదునుండి సుమారు రెండునూర్లమంది విశాలాంధ్రోద్యమాభిమానులు కర్నూలుకు వెళ్ళియుండిరి. 1953 అక్టోబరు ఒకటవ తేదీ సాయం కాలము కర్నూలులో తెలంగాణా ప్రతినిధుల సమావేశము జరిగినది. ఆ సమావేశములో అనంతశయనం అయ్యంగార్, బెజవాడ గోపాలరెడ్డి, అయ్యదేవర కాళేశ్వరరావు మొదలైన ఆంధ్ర నాయకులు పాల్గొనిరి. సమగ్రమైన చర్చలు జరిగిన పిదప తెలంగాణా ప్రతినిధులు విశాలాంధ్రకు కృషి చేయడానికి నిర్ణయించిరి.

### అసమగ్ర ఆంధ్రరాష్ట్రము.

రెండవ అక్టోబరు 1953 నాడు స్థాపితమైన ఆంధ్ర రాష్ట్రము అసమగ్రమైనది. మద్రాసు పట్టణము సంయుక్త రాజధానిగా అంగీకరించు కృషి విఫలమైనది. కర్నూలు రాజధానిగా ఎన్నుకొనుట జరిగినది. మద్రాసు నగరమే ఆనాడు సంయుక్త రాజధానిగ ఎన్నుకొనబడి యుండినచో హైదరాబాదు రాజధానియగు సమస్యకు తీవ్ర ప్రతిబంధకము కలిగెడిదేమో! హైదరాబాదు రాజధానికాని విశాలాంధ్రకు తెలంగాణమునుండి హృదయపూర్వకమగు సానుభూతి లభించెడిది కాదేమో! మద్రాసు రాజధాని కాకపోవుటలో ప్రకృతి యొక్క ప్రభావము కన్పడుచున్నది. కర్నూలు తాత్కాలిక రాజధాని మాత్రమే ననియు, ఆంధ్ర రాష్ట్రము అసమగ్రమైనదనియు ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి ప్రకాశం పంతులుగారు పలుమారులు ఉద్ఘాటించిరి. మొట్టమొదటి భాషారాష్ట్రముగ ఆంధ్రరాష్ట్రము ఎంత

అసమగ్రముగా నయినను ఏర్పడుట హైదరాబాదు ఆంధ్రులందరికి సంతోషకారణమైనది. ఆంధ్రరాష్ట్రము తొలిమెట్టుగా వారు విశాలాంధ్ర రాష్ట్రసాధనకు ఉద్యుక్తులైరి. రెండవ అక్టోబరు 1953 నాడు హైద్రాబాదులో ఆంధ్రరాష్ట్ర అభినందన సమావేశము కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయమున జరిగినది. ఈ సమావేశమున మాడపాటి హనుమంతరావు, కొండా వెంకటరంగారెడ్డిగారలు ఉపన్యసించుచు విశాలాంధ్రను అభిలషించిరి. తరువాత కొంత కాలమునకు బందరులో జరిగిన ఆంధ్ర నాట్యకళా పరిషత్తు సభలను ప్రారంభించుచు చెన్నారెడ్డిగారు విశాలాంధ్రను సమర్థించిరి. 1953 అక్టోబరు 2 వ తేదీనాడు కమ్యూనిస్టు పార్టీవారు ఆంధ్ర రాష్ట్ర అవతరణ అభినందన బహిరంగ సభను హైదరాబాదు నగరమున జరిపియుండిరి. అందు విశాలాంధ్రను కోరియుండిరి. ఈ విధముగ విశాలాంధ్రోద్యమము ప్రజల ఉద్యమముగ తెలుగుసీమలో బలపడినది.

## భాషారాష్ట్ర ఉద్యమము - అగ్రనాయకుల ఆగ్రహము

ఆంధ్రరాష్ట్ర స్థాపనవల్ల ఇతర భాషారాష్ట్రాలు కావలెనను వాదము మరింత బలపడినది. మహారాష్ట్రులు, కర్ణాటకులు కూడ తమ తమ రాష్ట్రములు కావలెనని ఆందోళన బయలుదేరదీసిరి. అందుచేత భారత ప్రభుత్వము రాష్ట్రాల పునర్నిర్మాణము కొరకు చర్య తీసుకొనక తప్పలేదు. బెంగుళూరులో జరిగిన అఖిల భారత కాంగ్రెసు స్థాయీ సంఘ సమావేశమున అయ్యదేవర కాళేశ్వరరావుగారు అఖిల భారత కాంగ్రెసు వేదిక నుండి మొట్టమొదటిసారిగా విశాలాంధ్ర సమస్యను గురించి ప్రస్తావించగా కాంగ్రెసు అగ్రనాయకులు ఆగ్రహించిరి. ఈ సమయమున బాబూ పురుషోత్తమదాస్ టాండన్ కాంగ్రెసుకు అధ్యక్షులుగా నుండిరి. బెంగుళూరులో కాళేశ్వరరావుగారి వాదమునకు నిజలింగప్ప, రామానందతీర్థ ప్రభృతులు అనుకూలురై యుండిరి. హైదరాబాదు నానల్ నగరమున జరిగిన అఖిల

భారత కాంగ్రెసు మహాసభకు వచ్చిన ప్రతినిధులను ఆహ్వానించుచు తన ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసమున స్వామి రామానందతీర్థ భాషారాష్ట్ర స్థాపనయొక్క ఆవశ్యకతను పునరుద్ఘాటించిరి. నిజలింగప్పవంటి కర్ణాటక నాయకులు, గాడ్గిల్, హీరేలవంటి మహారాష్ట్ర నాయకులు మొదట నుండియు భాషారాష్ట్రాల వాదమును బలపరచుచు, ఐక్య కర్ణాటక సంయుక్త మహారాష్ట్రముల కొరకు పనిచేయసాగిరి. నాసిక్ నగర సమావేశములో మొసలికంటి తిరుమలరావు, కళా వెంకట్రావుగారలు భాషా రాష్ట్రాలను బలపరచుచు మాట్లాడిరి. ఆంధ్రరాష్ట్రము కావలెనని ఉద్ఘాటించుచు కళా వెంకట్రావుగారు నాసిక్ నగర సమావేశంలో తెలుగులో ఉపన్యసించుట గమనించదగిన విశేషము. అఖిల భారత స్థాయిలోకూడ భాషారాష్ట్రోద్యమము వ్యాప్తి నందసాగినది. అఖిల భారత భాషారాష్ట్ర వాదుల సమావేశము అకోలా నగరములో 1952లో జరిగినది. ఇందులో అన్ని పక్షాలవారు పాల్గొనిరి. ఈ సమావేశానికి హైదరాబాదు నుంచి మీర్ అహమ్మదలీ ఖాన్ వెళ్ళి పాల్గొనిరి. హైదరాబాదు విభజన, ఐక్య కర్ణాటక, సంయుక్త మహారాష్ట్ర, విశాలాంధ్ర స్థాపన తీర్మానము ఇందులో ఆమోదింపబడినది. ఈ భాషారాష్ట్ర మహాసభకు అధ్యక్షులు డాక్టరు లంకా సుందరంగారు. డాక్టరు లంకా సుందరంగారు బొంబాయి, హైదరాబాదు మొదలగు కొన్ని నగరాలు కేంద్ర పరిపాలిత ప్రాంతాలు కావలెనని అభిప్రాయపడిరి. ఈ అభిప్రాయము భాషారాష్ట్రాభిమానులెవరికిని నచ్చలేదు. అందుచేత ఈ అఖిల భారత భాషారాష్ట్ర మహాసభ ఎక్కువగా ప్రజలను ఆకర్షించలేదు. కాని భాషా రాష్ట్రోద్యమము మాత్రము ప్రజల ఉద్యమముగా పరిణమించినది.

**గొప్ప బలము**

ఇట్టి పరిస్థితులలో హైదరాబాదు నగరమున విశాలాంధ్రోద్యమము వ్యాపించినది. విశాలాంధ్ర మహాసభ కార్య నిర్వాహకవర్గ సమావేశము

1953 సెప్టెంబరు 13, 14 తేదీలలో హైదరాబాదు నగరమున జరిగినది. ఇది విశాలాంధ్రోద్యమానికి గొప్ప బలము కల్గించినది. ఈ సమావేశము హైదరాబాదు నగరమునందలి కల్వ సూర్యనారాయణగారి భవనమున జరిగినది. బులుసు సాంబమూర్తి మొదలైన పెద్దలు ఇందులో పాల్గొని యుండిరి. ఈ విశాలాంధ్ర మహాసభ యొక్క కార్యనిర్వాహకవర్గము, స్థాయీ సంఘములలో ఆంధ్ర, తెలంగాణా ప్రముఖులు సభ్యులుగా చేరిరి. తెలంగాణాలోని అన్ని వర్గాల ప్రతినిధులు ఇందులో సభ్యత్వమును అంగీకరించిరి.

జె.వి. నర్సింగరావు, నరోత్తమరెడ్డిగారలు ఇందులో సభ్యులుగా నుండుటకు అంగీకరించి సమావేశాలలో పాల్గొనిరి. కమ్యూనిస్టులకు మాత్రము విశాలాంధ్ర మహాసభలో సభ్యత్వము కల్గించబడలేదు. వారు ప్రత్యేకముగ తమ ఆంధ్ర మహాసభ, ఇతర సంఘాలద్వారా విశాలాంధ్రోద్యమానికి బలము చేకూర్చిరి. ఈ విధముగా విశాలాంధ్రోద్యమము రెండు పాయలుగ పనిచేసినది. సూర్యమహాలులో జరిగిన విశాలాంధ్ర మహాసభ సమావేశము హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలో నూతనోత్సాహము కలుగచేసి అనేక కార్యకర్తలను తయారుచేసినది. ఉస్మాన్ గంజ్ వర్తకులు హైదరాబాదు, సికింద్రాబాదు మ్యునిసిపల్ కార్పరేషన్ల సభ్యులు ఈ ఉద్యమములో ముందుకువచ్చి పనిచేయుట గమనింపదగినది. ఈ సందర్భమున హైదరాబాదులోని ముగ్గురు వ్యక్తులను ప్రత్యేకముగ పేర్కొనవలసియున్నది. వారిలో మొదటివారు మీర్ అహమ్మదలీ ఖాన్, రెండవ వారు కొత్తూరు సీతయ్య, మూడవవారు పి. పుల్లారెడ్డి. పుల్లారెడ్డి గారు విశాలాంధ్ర మహాసభ కార్యదర్శిగా పనిచేసిరి. ఈ ముగ్గురు చివరి వరకు విశాలాంధ్రోద్యమ విజయముకొరకు గట్టి పట్టుదలతో అహోరాత్రములు కష్టపడి పనిచేసిరి. తరువాత విశాలాంధ్ర మహాసభ స్థాయీ సంఘ

సమావేశము 14 నవంబరు 1953 నాడు, హైదరాబాదు నగరమున లింగంపల్లిలోని వైశ్యవిద్యార్థి వసతిగృహములో మిక్కిలి వైభవముగ జరిగినది. ఆంధ్ర, తెలంగాణమందలి అన్ని ప్రాంతాల నుండి ఈ మహాసభకు ప్రతినిధులు వచ్చిరి. ఆహ్వాన సంఘమునకు కొత్తూరి సీతయ్యగారు అధ్యక్షులుగ, కల్వ సూర్యనారాయణ, నూకల నరోత్తమరెడ్డి, ధరణీధర సంఘి, లక్ష్మీచంద ఫలాని, డి.డి. ఇటాలియా, బెలిదె జగదీశ్వరయ్య, శాంతాబాయి, డాక్టర్ రంగాచారి, సర్దారుల్లాఖాన్, బి. కిషన్‌లాల్‌గారలు ఉపాధ్యక్షులుగ, యన్. భోజరాజ్‌గారు ప్రధాన కార్యదర్శిగా, కొమరగిరి నారాయణరావు, బి రామిరెడ్డి సుమిత్రాదేవిగారలు కార్యదర్శులుగ, ఎఱ్ఱం సత్యనారాయణగారు కోశాధ్యక్షులుగను పనిచేసిరి. అధ్యక్షత వహించిన అయ్యదేవర కాళేశ్వరరావుగారు విశాలాంధ్ర యొక్క అవశ్యకతను గూర్చి సమగ్రమైన ఉపన్యాసమును చదివిరి. మాడపాటి హనుమంతరావుగారు ఈ సమావేశములో పాల్గొని, సంపూర్ణముగ సహకరించిరి. తెలంగాణమందలి అన్ని పక్షములవారిందు పాల్గొనిరి. అప్పటి ఆంధ్ర రాష్ట్ర మంత్రులైన కడప కోటిరెడ్డి, పట్టాభి రామారావు, తెన్నేటి విశ్వనాథంగారలీ సభలో పాల్గొని ఉత్తేజకరమగు ఉపన్యాసముల నిచ్చిరి. హైద్రాబాదులోని ఆంధ్ర మహిళలు యీ సభలకు సంపూర్ణముగ సహకరించిరి. హైద్రాబాదు మంత్రులెవరు ఇందు పాల్గొనలేదు. మొత్తముమీద సభలు చాలా దిగ్విజయముగా జరిగినవి. హైద్రాబాదును సంపూర్ణ ఆంధ్ర నగరము కావించినవి. ఈ సమావేశమున గడియారము రామకృష్ణశర్మగారు చక్కని స్వాగత పద్యాలు వ్రాసి పఠించిరి. తరువాత శర్మగారు రెండు మూడు పర్యాయములు విశాలాంధ్రమును బలపరచుచు రసవంతమైన కవిత్వము వ్రాసిరి. ఈ పద్యాలు గోలకొండ పత్రికలో ప్రకటితమైనవి. తెలంగాణమున ప్రముఖాంధ్ర కవులు, రచయితలు విశాలాంధ్రను బలపరచిరి. మూడుకోట్ల తెలుగు ప్రజలను ఒక్కటిగా ముడివేయవలెనని దాశరథికవి

వ్రాసెను. ఈయన తన కావ్యమునకు "మహాంధ్రోదయ"మని నామకర ణము కావించెను. బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారు విశాలాంధ్ర కావలె నని ప్రబోధించుచు చక్కని పద్యములు వ్రాసిరి.

## రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘము

22 వ డిశంబరు 1953 నాడు పార్లమెంటులో భారత ప్రధాని నెహ్రూ కొన్ని నెలల క్రింద తాము చేసిన వాగ్దానమును అనుసరించి రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘమును ఏర్పాటుచేయు నిర్ణయమును ప్రకటించిరి. మిస్టర్ ఫజుల్ ఆలీ అధ్యక్షులుగా, హృదయనాధకుంజ్రు, ఫణిక్కర్‌గార్లు సభ్యులుగ మన దేశములోని రాష్ట్రాల పునర్నిర్మాణమును గూర్చి సమగ్రమైన విచారణ కావించి 1955 జూన్ 30 వ తేదీలోగా నివేదికను సమర్పించుటకు ఈ ఉన్నతాధికార సంఘమును భారత ప్రభు త్వము నియమించినది. భాష ప్రాధాన్యముతోపాటు, భారతదేశ ఐక్యత, రక్షణ, ఆర్థిక సమస్యలు మొదలైన వానిని దృష్టిలో నుంచుకొని రాష్ట్రాల పునర్నిర్మాణమును గూర్చి విచారణ చేయుటకు ఈ సంఘము ఆదేశింప బడినది.

## మొదటి ప్రతిఘటన లేదు

ఉద్యమ ప్రారంభములో విశాలాంధ్రోద్యమమునకు బలమైన ప్రతి ఘటన ఏమియు లేకుండెను. అప్పుడు రెండే అభిప్రాయములు హైద్రా బాదులో ప్రబలముగ నుండెను. హైద్రాబాదు విభజన కాకూడదనియు, రాష్ట్రము యధాతథముగ నుండవలెననియు ఒక అభిప్రాయము. దీనిని కొన్ని ప్రత్యేక వర్గాలు, వ్యక్తులు మాత్రమే బలపరచుట జరిగినది. రాష్ట్రములోని ఏ రాజకీయ పక్షముగూడ యీ వాదనను అంగీకరించ లేదు. అందుచేత ఈ వాదమునకు ప్రజాబలము లోపించినది. హైదరాబాదు

విభజన జరిగి, ఐక్య కర్నాటక, సంయుక్త మహారాష్ట్ర, విశాలాంధ్రములు ఏర్పడవలెననునది రెండవ వాదము. ఈ వాదమును అన్ని రాజకీయ పక్షాలు ఆమోదించినవి. అందుచేత ఈ వాదమునకు ప్రజాబలము సంపూర్ణముగ లభించినది. అప్పటివరకు కింకను ప్రత్యేక తెలంగాణా వాదము బయలుదేరలేదు. తరువాత తెలంగాణ వాదమును సమర్థించిన అనేకులు ప్రారంభమున విశాలాంధ్రోద్యమమును బలపరచి, సమర్థించిన వారగుట గమనింపదగిన విశేషము. 1954 వ సంవత్సరము జనవరి 14 వ తేదీ నాడు సంక్రాంతి పండుగ సందర్భమున ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్యాలయ ఆవరణలో విశాలాంధ్ర మహాసభ పక్షాన ఒక తేనీటి విందు ఏర్పాటు చేయబడినది. ఆ విందులో ఆంధ్ర పితామహులతో పాటు హైద్రాబాదు ఆంధ్ర ప్రముఖులందరు పాల్గొనియుండిరి. ముఖ్యులైన కొందరు ముస్లిములు కూడ ఈ విందులో పాల్గొనియుండిరి. హైకోర్టు జడ్జిగా రిటైరయిన నవాబు నాజర్ యార్ జంగ్ బహద్దర్, కామర్సు అండ్ ఇండస్ట్రీస్ సెక్రటరీగా రిటైరయిన మిస్టర్ హబీబుర్ రహిమాన్, సియాసత్ పత్రికా సంపాదకులైన మిస్టర్ ఆబిదలీ ఖాన్‌లు ఈ విందులో పాల్గొని, విశాలాంధ్రోద్యమమునకు తమ అమోదమును తెలిపిరి. ఈ ముగ్గురు తుదివరకు విశాలాంధ్రోద్యమమును బలపరిచిరి. ఈ విందులో ఆంధ్రేతరులైన ప్రముఖులు కూడ చాలమంది పాల్గొనియుండిరి. కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారి సహచరులుగా పనిచేసిన మునగాల రాజాగారు ఈ విందులోనేకాక ఇంతకు ముందు జరిగిన సభలలో కూడ పాల్గొనియుండిరి. హైద్రాబాదు పోలీసు శాఖలో గొప్ప పదవుల నలంకరించి రిటైరయిన ఆంధ్ర ప్రముఖులు యన్. యన్. రెడ్డిగారు విశాలాంధ్ర నామోదించిరి. వీరు విశాలాంధ్ర మహాసభ నగరశాఖ యొక్క కొన్ని సమావేశాలలో పాల్గొనియుండిరి. తరువాత వీరు ఫజుల్

అలీ కమీషను ముందు విశాలాంధ్రకు అనుకూలముగ సాక్ష్యము ఇచ్చి యుండిరి. 1954 వ సంవత్సర ప్రారంభములో హైదరాబాదు విశాలాంధ్ర మహాసభ నగరశాఖ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షులుగను, భోజరాజ్ కార్యదర్శిగను, ఇతర ప్రముఖులు సభ్యులుగను ఏర్పాటు జరిగి, వార్డు కమిటీలను కూడ నెలకొల్పి పనిచేయుట ప్రారంభమైనది. విశాలాంధ్ర మహాసభ కార్యాలయము నిజామ్‌షాహి రోడ్డులో నెలకొల్పబడినది. మహాసభ కార్యదర్శి పుల్లారెడ్డిగారు కార్యాలయ నిర్వహణ భారము వహించిరి. కొత్తూరు సీతయ్య, మీర్ అహమ్మదలీ ఖానుగారలు కార్యదర్శికి పెట్టని కోటలై పనిచేసిరి. ధరణీధర సంఘి, బచ్చు గురుమూర్తి, యస్. ఆర్. వెంకటేశం, డాక్టరు రంగాచారి, నరసింహాచారి, ఎల్లం సత్యనారాయణ, ఎల్లాప్రగడ సీతాకుమారి, తెలుగు దేశము సంపాదకురాలు రాజ్యలక్ష్మీదేవి మొదలైనవారు ఉత్సాహముతో ముందుకువచ్చి పనిచేసిరి. 1954 జూన్ 14, 15 తేదిలలో తెలంగాణా ఆంధ్రమహాసభ పక్షాన ఎగ్జిబిషన్సు గ్రౌండ్సులో మహాకవి శ్రీరంగం శ్రీనివాసరావుగారి అధ్యక్షతన విశాలాంధ్ర సదస్సు జరిగినది. ఇందులో కాంగ్రెసేతరులే ప్రధానముగ నుండిరి. ఆంధ్ర, తెలంగాణాలనుండి ఈ సదస్సులో వేయిమందికి పైగా ప్రతినిధులు పాల్గొనిరి. సదస్సు ప్రారంభ సమావేశమున మాడపాటి హనుమంతరావు పంతులుగారు ఆశీస్సుల నిచ్చిరి. ఈ మహాసభ ఏర్పాటు చేసి విజయవంతముగా నిర్వహించుటలో తెలంగాణా కమ్యూనిస్టు నాయకులకు చంద్ర రాజేశ్వరరావుగారు సహాయపడి, కొన్ని రోజులు హైద్రాబాదులో నుండి పనిచేసిరి. తరువాత గూడ రాజేశ్వరరావుగారు తెలంగాణాలో విశాలాంధ్రోద్యమ వ్యాప్తికి మంచి కృషి కావించిరి.

### చాలా ముఖ్యమైన వారము

1954 మే నెల చివరివారము హైద్రాబాదు చరిత్రలో చాల ముఖ్యమైనది. ఈ వారము హైద్రాబాదు ప్రజల అభిప్రాయ సేకరణ కొరకు

ఫజులాలీ కమీషనువారు హైద్రాబాదు వచ్చిరి. ఈ సందర్భమున ఒక ముఖ్యమైన సంఘటన గూర్చి ప్రత్యేకముగ వివరించవలసి యున్నది. ఈ సంఘము యొక్క రాకకు సుమారు ఆరువారముల ముందు హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గము యొక్క నిర్ణయము ప్రకారము ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాల డెలిగేట్ల సమావేశము విడివిడిగ జరుపబడినవి. రాష్ట్ర భవిష్యత్తునుగూర్చి ఫజులాలీ కమీషనుకు ఏమి చెప్పవలెనో నిర్ణయించుటకు ఈ సమావేశాలు ఉద్దేశించబడినవి. మహారాష్ట్ర, కర్ణాటకులు సంయుక్త మహారాష్ట్ర, ఐక్య కర్ణాటకాలను బలపరచను తీర్మానించిరి. తెలంగాణా డెలిగేట్లలో మాత్రము అభిప్రాయ భేదము కలిగెను. డాక్టరు చెన్నారెడ్డిగారు తెలంగాణా ప్రత్యేకముగ నుండవలెనను వాదమును లేవదీసి, ఒక బలమైన వర్గమునకు నాయకత్వము వహించిరి. ఈ సమావేశములో తెలంగాణ రాష్ట్రమును ముప్పదిమూడు (33) మంది డెలిగేట్లు బలపరచిరి. పదముగ్గురు (13) విశాలాంధ్రను బలపరిచిరి. నూరుమంది డెలిగేట్లలో మిగిలిన 54 గురు సమావేశములో పాల్గొనలేదు. మొత్తముమీద తెలంగాణా కాంగ్రెసు డెలిగేట్లలో రెండు అభిప్రాయాలు కలవనియు, ఆ రెండు అభిప్రాయాలను కమీషనుకు నివేదించవలెననియు నిర్ణయించబడెను. కాంగ్రెసు నియమావళి ప్రకారము మొత్తము హైద్రాబాదు రాష్ట్రమునకు ఒకటే ప్రదేశ్ కాంగ్రెసు కలదు. విడివిడిగా మూడు ప్రాంతాల డెలిగేట్ల సమావేశమునకు అవకాశము లేదు. మొట్టమొదటిసారి రాష్ట్ర విభజన తదనంతరము కర్తవ్యము గూర్చిన సమస్యమీద ఈ మూడు ప్రాంతాల డెలిగేట్లు, నియమావళిలో అవకాశము లేకపోయినను, విడివిడిగా సమావేశమగుట జరిగినది. ఇది సరియైన పద్ధతి కాదని కొందరి అభిప్రాయము. ఇందుకు అనుగుణముగా ఆ సమావేశములో పుల్లారెడ్డిగారు ఆక్షేపణ తెలిపిరి. ఏమయినప్పటికిని హైద్రాబాదు ప్రదేశ్ కాంగ్రెసునందు రెండు స్పష్టమైన పక్షాలు ఏర్పడినవి. ఒకటి విశాలాంధ్ర పక్షము, రెండవది తెలంగాణా పక్షము తరువాత ఈ పక్షాల ప్రభావము అడుగడుగున గోచరించినది.

**అభిప్రాయ సేకరణ**

ఫజుల్‌అలీ కమీషను ఆగమనముతో హైదరాబాదు రాజకీయ రంగమున కోలాహలము ప్రారంభమైనది. హైదరాబాదు రాష్ట్రములోని మూడు ప్రధాన రాజకీయ పక్షాలైన ప్రదేశ్ కాంగ్రెసు, కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీలు హైద్రాబాదు విభజన జరిగి తీరవలెనని ఉద్ఘాటించినవి. కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీలు విశాలాంధ్ర కావలెనని స్పష్టము చేసినవి. హైద్రాబాదు ప్రదేశ్ కాంగ్రెసులోని ఒక వర్గము విశాలాంధ్రము కావలెననియు, రెండవ వర్గము తెలంగాణము కావలెననియు తెలిపినవి. హైద్రాబాదు మంత్రివర్గము పక్షాన ఎటువంటి అభిప్రాయము వెల్లడిచేసినట్లు కనబడదు. వ్యక్తిగతముగా కొందరు మంత్రులు తమతమ అభిప్రాయములు తెల్పిరి. శాసన సభ్యులలో అధిక సంఖ్యాకులు విశాలాంధ్రమునే బలపరిచిరి. సాంస్కృతిక సంస్థలయిన ఆంధ్ర సారస్వత పరిషత్తు, తెలంగాణా రచయితల సంఘము విశాలాంధ్రమునే బలపరచినవి. బద్దం ఎల్లారెడ్డిగారు అధ్యక్షులుగానున్న ఆంధ్రమహాసభ విశాలాంధ్రమునే బలపరచినది. హైద్రాబాదు, సికింద్రాబాదు మునిసిపల్ కార్పొరేషనులు విశాలాంధ్రకు అనుకూలముగా సాక్ష్యము లిచ్చినవి. ఈ సందర్భమున విశాలాంధ్ర మహాసభ చాలా చురుకుగా పనిచేసినది. విశాలాంధ్ర మహాసభ పక్షాన ఒక రాయబార వర్గమును వెంట తీసికొని వెళ్ళి విజ్ఞప్తిని సమర్పించినది. విశాలాంధ్ర మహాసభ నగరశాఖ పక్షాన కూడ విశాలాంధ్రకు అనుకూలముగ సాక్ష్యము నిచ్చుట జరిగినది. హైద్రాబాదు విభజన కారాదని తెలిపినవారిలో మందుముల నర్సింగరావు, నవాబ్ మెహిదీనవాజ్ జంగు బహద్దుర్, పండిత వినాయకరావు, గోపాలరావు ఎక్బోటె, పండిత నరేంద్రజీ, కర్నల్ వాఘ్రే ప్రభృతులు పేర్కొనదగినవారు. ఫజుల్‌అలీ నివేదిక ప్రకటనానంతరము హైద్రాబాదు విభజన తప్పనిసరి అయినప్పుడు తెలంగాణా రాష్ట్రము ఏర్పడరాదనియు,

విశాలాంధ్రమే ఏర్పడవలెనని యీ వీరందరు ఉద్ఘాటించిరి. తెలంగాణా కాంగ్రెసు డెలిగేట్ల సంఖ్య నూరు. ఇందులో విశాలాంధ్రకు అనుకూలముగా సుమారు యేబది మంది సంతకాలను సేకరించి ఒక విజ్ఞప్తిని కమీషనుకు సమర్పించుట జరిగినది. ఈ సంతకాల సేకరణకై జిల్లాలు తిరిగి కష్టపడినవారిలో బొమ్మకంటి సత్యనారాయణరావు, పి. పుల్లారెడ్డి, వి. బి. రాజు, కొత్తూరి సీతయ్య, అహమ్మదలీఖాన్‌గారలను పేర్కొన వలసియున్నది. కమీషనువారు వరంగల్, కరీంనగర్, నల్లగొండ జిల్లాలలో పర్యటన కావించిరి. ఈ పర్యటన సందర్భములో వారి కనేక విజ్ఞప్తులు సమర్పించబడినవి. ఈ విజ్ఞప్తులను పరిశీలించినపుడు విశాలాంధ్రోద్యమానికి ప్రజల అభిప్రాయము అనుకూలముగ నున్నదని వెల్లడియైనది. తరువాత విశాలాంధ్ర మహాసభ వైపునుండి రెండు అనుబంధ విజ్ఞప్తులు కూడ అంకెలతో సహా వివరాలను తెలుపుచు సమర్పించబడినవి. అప్పటి హైద్రాబాదు ముఖ్యమంత్రి రామకృష్ణారావుగారు వ్రాతపూర్వకముగ ఏమియును ఇచ్చినట్లు కనపడదు. అయినను వారు విశాలాంధ్రకే సుముఖులై యుండినట్లు అభిజ్ఞవర్గాల ద్వారా తెలిసినది. అంతేకాదు— విశాలాంధ్రకు అనుకూలురమని అంతకుముందే ప్రకాశం పంతులుగారికి రామకృష్ణారావుగారు తెలిపినట్లు వారి సన్నిహిత వర్గాల వలన తెలిసినది. తరువాత కమీషను పర్యటన ఆంధ్రరాష్ట్రములో జరిగినది. ఆంధ్రరాష్ట్రములో అన్ని రాజకీయపక్షాలవారు, అన్ని వర్గాలవారు విశాలాంధ్రను ఆమోదించిరి. జాతీయ సమరములో ఆరితేరిన వృద్ధమూర్తి, త్యాగమూర్తి అయిన ప్రకాశం పంతులుగారి నాయకత్వాన ఆంధ్ర మంత్రివర్గము విశాలాంధ్రము కావలెనని ఉద్ఘాటించినది. ఆనాడు మంత్రివర్గములో సభ్యులుగా నుండిన తెన్నేటి విశ్వనాథంగారు విశాలాంధ్రము కొరకు ప్రశంసనీయమైన కృషి కావించిరి. మొదటినుండియు సంజీవరెడ్డిగారు విశాలాంధ్రకు పెట్టని కోటగా నుండిరి. సంజీవరెడ్డిగారి పట్టుదల, కార్య

దక్షత విశాలాంధ్ర సాధనకు మిక్కిలి ఉపకరించినది. పదవ సెప్టెంబరు 1954నాడు మద్రాసులో పత్రికా ప్రతినిధులతో మాట్లాడుచు, ఐక్య కర్ణాటక, సంయుక్త మహా రాష్ట్రములు ఏర్పడినచో విశాలాంధ్ర కూడ ఏర్పడి తీరవలెనని బూర్గుల రామకృష్ణారావుగారు ప్రకటించిరి. ఇది ఇంతవరకు స్పష్టముగా బహిర్గతము కాని వారి మనోగతాభిప్రాయము యొక్క స్పష్ట ప్రతిబింబముగా ప్రకాశితమైనది. కాని రామకృష్ణారావుగారు నిజామాబాదు కాంగ్రెసు సమావేశమున తీర్మానమును ప్రతిపాదించుటలోనే వారి విశాలాంధ్రము ఆమోదము ప్రకటితమైనది. అంతేకాదు, పోలీసు చర్యకు పూర్వము ముషీరాబాదులో స్వామీ రామానంద అధ్యక్షతన జరిగిన సమావేశములో బాధ్యతయుత ప్రభుత్వ స్థాపన తీర్మానమును ప్రతిపాదించుచు "హైద్రాబాదు కృత్రిమముగా యేర్పడిన రాష్ట్రము" అని రామకృష్ణారావుగారు ఉద్ఘాటించి యుండిరి. ఈఉద్ఘాటన కూడ హైదరాబాదు విభజనకు' విశాలాంధ్రకు వారి ఆమోదమును వెల్లడించుచున్నది. కమిషనువారు హైదరాబాదు రాష్ట్రములో పర్యటన చేసి వెళ్ళిన పిదప కాంగ్రెసులో రెండు భిన్న వర్గాలు ప్రస్ఫుటముగ బయలుదేరినవి. ప్రదేశ్ కాంగ్రెసు ప్రత్యేక తెలంగాణా వర్గమువారి అధీనమైనది. కొంతమంది తలవని తలంపుగా అంతకు ముందు విశాలాంధ్ర వాదులు అయినప్పటికిని తరువాత తెలంగాణా వాదులైరి. 1954 వ సంవత్సరము ఈ విధముగ గడచినది. విశాలాంధ్రోద్యమము మరింత బలపడినవి. విశాలాంధ్ర మహాసభ పక్షాన ఒక సుహృద్భావ రాయబార వర్గము ఏడవ ఆగస్టు 1954నాడు హైదరాబాదు నుంచి హైదరాబాదు మేయర్ నాయకత్వమున బయలుదేరినది. కర్నూలు, గుంటూరు, విజయవాడలలో పర్యటించి వచ్చినది. ఈ రాయబార వర్గములో విశాలాంధ్రోద్యమ ప్రముఖ కార్యకర్తలు వెళ్ళిరి. వీరికి పై మూడు పట్టణాలలో ఘనమైన స్వాగత మీయబడినది. వీరికి ఈయబడిన స్వాగతములో అన్ని రాజకీయ పక్షాలవారు పాల్గొనుట గమనించ

దగిన విషయము. ఈ సంవత్సరము (1954) హైద్రాబాదుకు అప్పటి ఆంధ్ర ప్రభుత్వ ఆర్థిక మంత్రి తెన్నేటి విశ్వనాధముగారు నాలుగైదు మారులు విచ్చేసి, ఇక్కడి కార్యకర్తలను కలుసుకొని,వారిని ప్రోత్సహించి సుహృద్భావ వాతావరణము ఏర్పడుటకు చక్కని కృషి గావించిరి. 1955 వ సంవత్సర ప్రారంభంలో అప్పటి ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు బెజవాడ గోపాలరెడ్డిగారు కళా వెంకటరావుగారితోకలిసి హైద్రాబాదువిచ్చేసి విశాలాంధ్ర మహాసభలోను కాంగ్రెసు కార్యాలయమైన గాంధీ భవనము లోను ప్రసంగించి విశాలాంధ్రోద్యమమును ప్రోత్సహించిరి. తరువాత ఆంధ్రలో ఎన్నికలు జరిగినవి. ఇక్కడివారు అక్కడికివెళ్ళి ఎన్నికలలో పనిచేసి పరస్పర స్నేహసంబంధాలను కల్పించుకొనిరి. ఆ పైన ఆంధ్ర రాష్ట్రములో కొత్త మంత్రి వర్గము ఏర్పడినది. ముఖ్యమంత్రి గోపాలరెడ్డి గారు 1955 ఏప్రిల్ నెలలో తిరిగి హైద్రాబాదు వచ్చి విశాలాంధ్ర మహా సభలో ప్రసంగించి విశాలాంధ్రోద్యమమును ప్రోత్సహించిరి.

### గోపాలరెడ్డిగారి జోస్యము

జూన్ 1955 లో ఫజుల్ఆలీ కమిషను నివేదిక ప్రకటింపబడవలసి యుండెను. కాని మూడు నెలలు ఆలస్యముగ ఈ నివేదిక వెలువడినది. నివేదిక వెలువడుటకు కొన్ని వారాల ముందుగా ఢిల్లీనుండి కర్నూలు వెళ్ళుచు మార్గమధ్యమున హైద్రాబాదులో ఆగిన బెజవాడ గోపాలరెడ్డిగారు నిజాం కళాశాల తెలుగు సమితికి ప్రారంభోత్సవము కావించుచు హైద్రా బాదు విభజన కాగలదనియు, విశాలాంధ్ర సమస్యను తెలంగాణా శాసన సభ్యుల నిర్ణయానికి వదలివేయవచ్చుననియు రాజకీయ జోస్యము చెప్పిరి. ఇది రాజకీయ వర్గాలలో కొంత కలవరము కలిగించినది. మొత్తము మీద హైద్రాబాదు విభజన తప్పక జరిగి తీరగలదను సత్యము స్థిరపడినది.

### విచిత్రమైన తీర్పు

తుదకు చాలాకాలము నుండి ఎదురుచూచిన కమీషను నివేదిక 1955 అక్టోబరు పదవ తేదీనాడు ప్రకటితమయినది. కమీషను నివేదికలో తెలుగు

ప్రజలు విశాలాంధ్రము కాంక్షిచుచున్నారనియు, విశాలాంధ్రము వారి గమ్యస్థానమనియు, ఆ గమ్యస్థానమును చేరుటకు ఎటువంటి ప్రతిబంధకాలు కల్గించరాదనియు స్పష్టీకరించనైనది. కోర్టులో వాదము విన్న తరువాత న్యాయమూర్తులు తుదినిర్ణయము ప్రకటించు సందర్భమున నిర్ణయించుటకు చెప్పిన తీర్పులోని అభిప్రాయములన్నియు ఒక తీరుగను, తుట్టతుదకు డిక్రీ మాత్రము మరొక విధముగను ఇచ్చినట్లుగా వాదమంతయు విశాలాంధ్రకు అనుకూలముగ చెప్పి, అయిదేండ్లవరకు ప్రత్యేక తెలంగాణా రాష్ట్రము ఏర్పాటు చేయవలెనని, ఆ తరువాత అనగా 1961 వ సంవత్సరమున ఎన్నికయిన శాసన సభలో మూడింట రెండు వంతుల సభ్యుల ఆమోదముతో విశాలాంధ్రము ఏర్పడవలెనని కమీషనువారు డిక్రీ ఇచ్చిరి. కమీషను నివేదిక ప్రకటన అయిన తరువాత వ్యక్తులు, రాజకీయ పక్షాలు తమ తమ అభిప్రాయాలను ప్రకటించుట జరిగినది. ప్రత్యేక తెలంగాణా వర్గాలు హర్షించుటయు, విశాలాంధ్రవర్గాలు ఆశాభంగము వెల్లడించుటయు జరిగినది. పుల్లారెడ్డి, దేవులపల్లి రామానుజరావు మొదలైన విశాలాంధ్ర వాదులు అసంతృప్తిని ప్రకటించి, తక్షణ విశాలాంధ్ర స్థాపన కావలెనని ఉద్ఘాటించిరి. విశాలాంధ్ర కావలెనని మాత్రము తక్షణమే నిర్ణయించి ఆరేండ్ల తరుహత ఆ నిర్ణయమును అమలు జరుపవచ్చునని శ్రీ ఎం. ఎస్. రాజలింగంగారొక సూచన కావించిరి. (14 అక్టోబరు 1955 నాటి గోలకొండ పత్రిక చూడుడు.) ఆరేండ్ల వ్యవధిని నిర్ణయించుటకు బదులుగా తెలంగాణా శాసనసభ్యులు యెపుడు ఇష్టపడిన అపుడే విశాలాంధ్ర యేర్పాటు చేయుటకు వీలుకలిగించవలెనని మాత్రము వల్లూరి బసవరాజుగారింకొక సూచన గావించిరి. (12 అక్టోబరు 1955 నాటి ఆంధ్ర జనత చూడుడు.) హైదరాబాదు విభజనకు వ్యతిరేకులయినవారు రాష్ట్ర విభజన తప్పనిసరి అయినప్పుడు ప్రత్యేక తెలంగాణము కన్న విశాలాంధ్రమే వాంఛనీయమని వ్యాఖ్యానించిరి. ఈ విధముగ విశాలాంధ్రము బలపరచువారి సంఖ్య

హెచ్చినది. ఇట్లు బలపరిచిన వారిలో మందుముల నర్సింగరావు, పండిత వినాయకరావు, పండిత నరేంద్రజీ, గోపాలరావు ఎక్బోటె, నవాబ్ మెహిదీనవాజ్ జంగు మొదలయినవారు కలరు. అన్నిటికన్న విచిత్రమైన సంఘటన యేమనగా, విశాలాంధ్రోద్యమానికి మొదటినుండిపట్టుగొమ్మయై ఆంధ్రోద్యమ రథసారథియై, ఆంధ్ర పితామహ బిరుదాంకితులై, హైద్రాబాదులో ఆంధ్రత్వమునకు పర్యాయ పదముగ ప్రసిద్ధి గాంచిన పద్మభూషణ మాడపాటి హనుమంతరావు పంతులుగారు అయిదేండ్లవరకు తెలంగాణము ప్రత్యేకముగ నుండుట తమకు సమ్మతమేయని ప్రకటించిరి. ఈ విధముగ పంతులుగారు చూపిన నూతన మార్గమును ఇంతవరకు విశాలాంధ్ర వాదులుగ నుండిన మరికొందరు అనుగమించిరి. తత్ఫలితముగా హైద్రాబాదు మ్యునిసిపల్ కార్పొరేషనులో విశాలాంధ్ర అనుకూలుర సంఖ్య తగ్గినది.

### ప్రస్ఫుటమైన రెండు వర్గాలు

విశాలాంధ్ర, తెలంగాణా అను రెండు వర్గాలు హైద్రాబాదు రాజకీయరంగమున ప్రస్ఫుటముగ బయలుదేరి పనిచేయసాగినవి. కాంగ్రెసు, ప్రజా సోషలిస్టు పార్టీలో యిట్టి రెండు భిన్న వర్గాలు ముందుకు వచ్చినవి. కమ్యూనిస్టు పార్టీలో ఇట్టి విభేదాలు రాలేదు. వారందరు ఒకే గొంతుతో మాట్లాడిరి. భారత ప్రభుత్వము ఈ విషయమై తుదినిర్ణయము చేయవలసినదై యుండెను. అందుచేత విశాలాంధ్ర, తెలంగాణ ఉభయపక్షాలు తమ తమ అభిప్రాయాల కనుకూలముగ భారతప్రభుత్వము నిర్ణయము చేయవలసినదని అభ్యర్థనలు, విజ్ఞప్తులు మొదలైన కార్యకలాపాలు ప్రారంభించిరి. విశాలాంధ్రోద్యమము సంఘటితము కాజొచ్చెను. అక్టోబరునెలలో విశాలాంధ్ర మహాసభ కార్యాలయమున తెలంగాణమందలి విశాలాంధ్రోద్యమ కార్యకర్తలు బొమ్మకంటి సత్యనారాయణరావుగారి అధ్యక్షతన సమావేశమయి విశాలాంధ్ర సాధనకై పనిచేయుటకు నిర్ణయించుకొనిరి.

1955 నవంబరు 8 వ తేదీనాడు పీల్ఖానాలో గల వైశ్యభవనములో విశాలాంధ్రోద్యమ కార్యకర్తలు మీర్ అహమ్మదలీఖాన్‌గారి అధ్యక్షతన సమావేశమయి వెంటనే విశాలాంధ్ర కావలెనని తీర్మానించిరి. ఇందుకొరకై ఢిల్లీకి వెళ్ళి అక్కడి పెద్దలను కలుసుకొని తక్షణ విశాలాంధ్ర నిర్మాణావశ్యకతను తెలియచెప్పుటకు ఒక రాయబార వర్గము నియమింపబడినది. ఈ రాయబార వర్గములో మీర్ అహమ్మదలీఖాన్, బొమ్మకంటి సత్యనారాయణరావు, పాగ పుల్లారెడ్డి, కొత్తూరి సీతయ్య, బి.వి. గురుమూర్తి, వి.బి. రాజు మొదలైనవారుండిరి. వీరు నవంబరు మొదటివారంలో ఢిల్లీకి వెళ్ళి అక్కడ ఒకవారము రోజులుండి భారత ప్రధాని జవహర్లాలు నెహ్రూ, ఉప రాష్ట్రపతి డాక్టరు రాధాకృష్ణ, దేశీయ హోమ్ వ్యవహారాల మంత్రి గోవింద్ వల్లభపంత్, కాంగ్రెస్ అధ్యక్షులు ధేబరు మొదలైన పెద్దలను సందర్శించి తక్షణమే విశాలాంధ్రను యేర్పర్చవలసిన అవశ్యకతను వెల్లడించిరి. తెలంగాణా కమ్యూనిస్టుల పక్షానగూడ రావి నారాయణ రెడ్డిగారి నాయకత్వాన ఒక రాయబారవర్గము ఢిల్లీలోని పెద్దలను సందర్శించి వెంటనే విశాలాంధ్ర ఏర్పడవలెనని వివరించిరి. ఆంధ్ర కమ్యూనిస్టు నాయకులైన పుచ్చలపల్లి సుందరయ్య, చండ్ర రాజేశ్వరరావుగారలు ఢిల్లీకి వెళ్ళి తక్షణ విశాలాంధ్రకు అనుకూలముగ పనిచేసిరి.

### రెండు ముఖ్య సంఘటనలు

నవంబరు నెలలో అఖిల భారత కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సమావేశము జరిగినది. ఈ సమావేశమునకు ముందు జరిగిన రెండు ముఖ్య సంఘటనలను వివరించవలసి యున్నది. మొదటిది, 1955 అక్టోబరు 22 వ తేదీన క్రొత్త ఢిల్లీలో జరిగిన ముఖ్యమంత్రుల సమావేశము ఈ సమావేశానికి బయలుదేరి వెళ్ళుటకు ముందు హైద్రాబాదు ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారిని ఉభయపక్షాలు కలుసుకొని తమ తమ అభిప్రాయాలను కేంద్ర ప్రభుత్వానికి తెలుపవలసినదని కోరిరి. విశా

లాంధ్ర మహాసభ కార్యకర్తలు మహాసభ పక్షాన విజయదశమి 17 అక్టోబరు 1955 నాడు రామకృష్ణారావుగారిని కలుసుకొని తమ అభిప్రాయాలను కేంద్ర ప్రభుత్వమునకు తెలుపవలసినదని కోరిరి. అందరి అభిప్రాయాలను, స్థానిక పరిస్థితులను కేంద్ర ప్రభుత్వమునకు తెలియ చేయగలనని రామకృష్ణారావుగారు తెలిపియుండిరి. ముఖ్యమంత్రుల సమావేశమున పాల్గొని హైద్రాబాదుకు తిరిగివచ్చిన పిమ్మట కొద్దిరోజులకే రామకృష్ణారావుగారు సుదీర్ఘమైన ప్రకటన గావించుచు, వెంటనే విశాలాంధ్ర ఏర్పడవలెనని 28 అక్టోబరునాడు ప్రకటించిరి. అయిదేండ్ల వరకు తెలంగాణాను ప్రత్యేకముగా నుంచినచో యిందువల్ల పెక్కు చిక్కులు ఉత్పన్నము కాగలవని, ఈ అయిదుసంవత్సరాలలో విశాలాంధ్ర, తెలంగాణా జగడము ప్రతినిత్యము జరుగుచునే యుండగలదని, ఇది యెన్నికల సమస్యకూడా కాగల అవకాశము కలదనియు, అందుచే తక్షణ విశాలాంధ్ర నిర్మాణము శ్రేయస్కరమనియు రామకృష్ణారావుగారు తెలిపిరి. వెంటనే విశాలాంధ్ర ఎందుకు రావలెనో ఈ ప్రకటనలో చక్కగా వివరింపబడినది. ఈ ప్రకటనయొక్క తెలుగుభాషాంతరీకరణము విశాలాంధ్ర మహాసభ అచ్చువేసినది. ఈ ప్రకటన విశాలాంధ్రోద్యమానికి బలమైన ఊతయైనది. ఢిల్లీలో జరిగిన ముఖ్యమంత్రుల సమావేశము తరువాత కర్నూలు తిరిగి వెళ్ళుచు హైదరాబాదులో కొన్ని గంటలు ఆగి, ఆనాడు విశాలాంధ్ర మహాసభ పక్షాన వారిని కలుసుకొనిన విశాలాంధ్ర కార్యకర్తలతో బెజవాడ గోపాలరెడ్డి గారు ప్రసంగించుచు, ముఖ్యమంత్రుల సమావేశములో ఆంధ్ర, హైదరాబాదు ముఖ్యమంత్రులు ఉభయులు తక్షణము విశాలాంధ్ర నిర్మాణమును కోరిరనియు, రామకృష్ణారావుగారు తన ప్రసంగమున విశాలాంధ్ర వాదమును అతి సమర్థతతో కావించిరనియు తెలిపిరి. రెండవ సంఘటన నవంబరు మొదటి వారములో ఢిల్లీలో జరిగిన ప్రదేశ్ కాంగ్రెసు

ఆధ్యక్షుల సమావేశము ఈ సమావేశానికి ముందు 1955 అక్టోబరు 31 వ తేదీన తెలంగాణా కాంగ్రెసు డెలిగేట్ల సమావేశము ఏర్పాటు చేయ బడెను. ఈ సమావేశములో అధిక సంఖ్యాక డెలిగేట్లు (1-11-55 నాడు ఏబదిమంది డెలిగేట్లు) కమిషను వారి నిర్ణయమును, అనగా అయిదేండ్ల తెలంగాణాను బలపర్చిరి. అల్పసంఖ్యాక డెలిగేట్లు ( 17 మంది ) విశాలాంధ్రమును బలపరిచిరి. వీరిలో రామకృష్ణారావుగారొకరు. ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుల సమావేశములో పాల్గొనిన హైద్రాబాదు ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు జె. వి. నర్సింగరావుగారు శాశ్వత ప్రత్యేక తెలంగాణా కావలెనని కోరిరి. నర్సింగరావుగారు ఢిల్లీ నుంచి తిరిగివచ్చిన తర్వాత శాశ్వతముగ ప్రత్యేకతెలంగాణము ఏర్పడుట తమ అభిప్రాయమని ప్రకటించిరి. చెన్నారెడ్డిగారు కూడ ఇట్టి ప్రకటననే కావించినారు. రంగారెడ్డిగారు ప్రత్యేక తెలంగాణా ఉద్యమానికి నాయకత్వము వహించిరి. ఈ విధముగ తెలంగాణా రాష్ట్ర ఉద్యమము విజృంభించుట జరిగినది. ఇట్టి పరిస్థితిలో క్రొత్త ఢిల్లీలో అఖిల భారత కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సమావేశము జరిగినది. 1955 నవంబరు 9 వ తేదీన వర్కింగ్ కమిటీ విశాలాంధ్ర ఏర్పడుట ఉచితమని తెలంగాణా ప్రజలకు సలహానిచ్చినది. ఈ సందర్భమున అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ, అఖిల భారత ప్రజా సోషలిస్టు పార్టీ వెంటనే విశాలాంధ్ర ఏర్పడవలెనని తీర్మానించిన సత్యము గమనించదగినది.

### సంప్రదింపులు

1955 నవంబరు మొదటి వారములో ఆంధ్ర ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు, డిప్యూటీ ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు, ప్లానింగ్ మంత్రి కళా వెంకటరావు గారు, సహకారమంత్రి సంజీవయ్య గారు, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు అల్లూరి సత్యనారాయణరాజు గారు హైదరాబాదుకు వచ్చి, ఉభయ పక్షాల వారితో సంప్రదింపులు . జరిపిరి.

అనాడు పగలు మూడు గంటలకు గాంధి భవనంలో పైన పేర్కొన్న ఆంధ్ర నాయకులతో హైదరాబాదు కాంగ్రెసు నాయకులు బూర్గుల రామ కృష్ణారావు, కొండా వెంకటరంగారెడ్డి, చెన్నారెడ్డి, జె వి నరసింగరావు గారల సమావేశము జరిగి, దీర్ఘ చర్చల తరువాత నవంబరు 28 వ తేదీ 1955 నాడు కర్నూలులో తిరిగి సమావేశమగుటకు నిర్ణయించబడినది. ఈ సమావేశమున రామకృష్ణారావుగారు విశాలాంధ్రను గట్టిగ బలపరిచిరి. తరువాత ప్రత్యేక తెలంగాణా నాయకులు కర్నూలు వెళ్ళుటకు ఇష్టపడి లేదు. అందుచేత ఈ సమావేశము జరుగలేదు.

## ఉద్ధృత విశాలాంధ్ర ఉద్యమము

ఇది ఇట్లుండగా విశాలాంధ్రోద్యమము క్రమక్రమముగా బలపడ సాగినది. విశాలాంధ్ర మహాసభ పుస్తకాలను, కరపత్రాలను ఉర్దు, తెలుగు భాషలలో ప్రకటించి, సమావేశాలను జరిపి, సదస్సులను నిర్వ హించి ఇతర ప్రచార కార్యక్రమాల ద్వారా అఖిల భారత కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సలహాప్రకారము విశాలాంధ్రోద్యమమును బలపరచ సాగినది. జిల్లాలలో సమావేశాలను జరిపి విశాలాంధ్రోద్యమమును బలపర చినవారిలో బొమ్మకంటి సత్యనారాయణరావు, పి. పుల్లారెడ్డి, కొత్తూరి సీతయ్య, మీర్ అహమ్మదలీఖాన్, వి బి రాజు, నరేంద్రజీ, కొండా లక్ష్మణ్, ఎఱ్ఱం సత్యనారాయణ మొదలైనవారిని పేర్కొనవలసి యున్నది. జనార్దన్‌రావు దేశాయిగారు విశాలాంధ్రోద్యమమునకు తోడ్ప డిరి. కమూనిస్టు నాయకులుకూడ జిల్లాలలో అనేక సభలను, సదస్సు లను జరిపి విశాలాంధ్రోద్యమమునకు బలమును చేకూర్చిరి. కొన్నిచోట్ల అఖిలపక్ష సమావేశాలు కూడ జరిగి విశాలాంధ్రను బలపరచుట జరిగి నది. ఈ అఖిలపక్ష సమావేశాలలో చుండి జగన్నాథం, కోదాటి, కొమర గిరి, కాశోజీగారలు ఉత్సాహముతో పాల్గొని పనిచేసిరి. వావిలాల గోపాలకృష్ణయ్యగారు కొన్ని సమావేశాలలో పాల్గొనిరి. మహిళలు కూడ

విశాలాంధ్రోద్యమములో పాల్గొని ముందుకు వచ్చిరి. ఇట్లు పని చేసిన మహిళలలో ఎల్లాప్రగడ సీతాకుమారి, సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి, విజయలక్ష్మి, రాజమణీదేవిగారలను పేర్కొనవలసియున్నది. రెండు నూర్లకుపైగా విశాలాంధ్ర సదస్సులు తెలంగాణమందు జరిగినవి. గ్రామ పంచాయతీలు, మునిసిపాలిటీలు, కాంగ్రెసు సంఘాలు, కార్మిక సంఘాలు విశాలాంధ్రకు తమ ఆమోదమును కేంద్ర ప్రభుత్వమునకు తెలియచేసినవి. విద్యార్థులలో ఉభయపక్షాలు విజృంభించినవి. తాత్కాలికోద్రేకాల వల్ల అక్కడక్కడ కొద్ది దౌర్జన్యాలు కూడ జరిగినవి. వివిధ వర్గాలవారు విశాలాంధ్రను బలపరచుచు తీర్మానాలు కావించి కేంద్ర ప్రభుత్వమునకు తెలియచేసిరి. 12 నవంబరు 1955 నాడు రెండు ముఖ్యమైన సమావేశాలు జరిగినవి. ఒకటి ప్రతాపగిర్జి కోఠీలో, రెండవది చార్మినార్‌వద్ద. ఈ రెండు సమావేశాలు హైదరాబాదులోని అల్పసంఖ్యాకులైన మహారాష్ట్ర, కర్ణాటక, గుజరాతీ, ముస్లిమ్, మార్వాడి ప్రతినిధులచేత, ప్రముఖులచేత ఏర్పాటు చేయబడినవి. ఈ రెండుసమావేశాలలో విశాలాంధ్రను బలపరచుచు చేయబడిన తీర్మానాలు కేంద్ర ప్రభుత్వానికి పంపబడినవి. 1955 నవంబరు 22 వ తేదీనాడు జి.వెంకటాచలం (అడ్వకేటు)గారి అధ్యక్షతన హైదరాబాదు న్యాయవాదుల సమావేశము విశాలాంధ్రమే తమ అభిమతమని ప్రకటించినది. 24 నవంబరు 1955 నాడు చార్మినార్‌వద్ద రావి నారాయణరెడ్డిగారు అధ్యక్షులుగా, కాళోజి నారాయణరావుగారు ప్రారంభకులుగ జరిగిన తెలంగాణా ప్రతినిధుల సమావేశములో జిల్లాల నుండి అయిదు నూర్లకు పైగా ప్రతినిధులు పాల్గొని వెంటనే విశాలాంధ్ర కావలెనని ప్రకటించిరి. ఇవిగాక వర్తక, వృత్తి సంఘాలు మొదలైనవి విశాలాంధ్రను బలపరచి, కొన్ని వందల టెలిగ్రాములు కేంద్ర ప్రభుత్వానికి పంపినవి. ఈ ఉద్యమ నిర్వహణలో విశాలాంధ్ర మహాసభ అతి జాగ్రత్తగా, మిక్కిలి చురుకుగా పని గావించినది. ఈ పరి

స్థితులలో 25 వ నవంబర్ 1955 నాడు హైదరాబాద్ శాసన సభ సమావేశము జరిగినది. ఈ సమావేశములో ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు గారు ఆంధ్ర, తెలంగాణాల ఏకీకరణ కావలెనను తీర్మానమును ప్రతిపాదించిరి. ఈ తీర్మానమును ప్రతిపాదించుచు రామ కృష్ణారావుగారు విశాలాంధ్ర ఎందుకు కావలెనో వివరించుచు సమగ్రమైన ఉపన్యాసమును కావించిరి హైదరాబాదు శాసన సభలో 175 మంది సభ్యులు. ఇందులో 147 మంది చర్చలలో పాల్గొనిరి. 103 గురు తక్షణ విశాలాంధ్రను కోరిరి. 28 మంది మాత్రమే ప్రత్యేక తెలంగాణమును కోరిరి. అసెంబ్లీలో చర్చలు యీ విధముగా జరుగుచుండగా కొండా వేంకట రంగారెడ్డిగారు ఢిల్లీకి వెళ్ళి ఒక ఆదేశమును తెచ్చిరి. ఆ ఆదేశము ఫలితముగ అంతవరకు అనుకొనినట్లుగా శాసన సభలో ఓటింగ్ జరుగక, సమావేశము 4 డిసెంబరు 55 నాటికి వాయిదా పడినది. కాని సభ్యుల అభిప్రాయాల వివరాలు మాత్రము కేంద్ర ప్రభుత్వమునకు అందచేయబడెను. శాసన సభలో ముఖ్యమంత్రిగారు 23 నవంబరు 55 నాడు చేసిన ప్రసంగముయొక్క సారాంశము తెలుగులో విశాలాంధ్ర మహాసభచే ప్రకటింపబడినది. ఇదిగాక మరికొన్ని కరపత్రాలు ప్రకటింప బడినవి. రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు తిరుపతి విశ్వవిద్యాలయ సెనేటుకు ప్రారంభము జరుపుచు విశాలాంధ్రను ఆశీర్వదించినారు. విజ్ఞానమూర్తులై వేదాంతవేత్తలైన సకల ప్రపంచమునకు సన్మార్గము చూపగలిగిన మహానుభావుల ఆశీర్వచనములు యీ ఉద్యమానికి లభించినవి. వినోబా భావె విశాలాంధ్రను ఆమోదించిరి. ఆర్థిక శాస్త్రవేత్తలు తెలంగాణము స్వయం పోషకముగాదని, విశాలాంధ్ర ఏర్పడుటయే ప్రజలకు శ్రేయస్కరమైన దని తెలిపిరి. ఢేబరు విశాలాంధ్ర ఏర్పడవలెనని సలహా నిచ్చిరి. ఈ పెద్దల ఆశీస్సులను, సలహాలను ఒకచోట క్రోడీకరించి విశాలాంధ్ర మహాసభ పక్షాన ఒక కరపత్రము ప్రకటింపబడినది. విశాలాంధ్ర మహా

సభవారు ప్రకటించిన పుస్తకాలు, కరపత్రాలను వేల సంఖ్యలో ప్రజలకు అందచేయుట జరిగినవి. "ఆంధ్ర జనత", "తెలుగు దేశం", "డెయిలీ న్యూస్" (ఇంగ్లీషు), ''సియాసత్'', ''పయామ్'' (ఉర్దూ), ''విశాలాంధ్ర'', ''ఆంధ్రప్రభ", "ఆంధ్రపత్రిక", ''విజయవాణి" మొదలైన పత్రికలు విశాలాంధ్రను బలపరచినవి.

**తీవ్ర పరిస్థితులు**

తెలంగాణములో పరిస్థితులు యీ నాలుగయిదు నెలలు తీవ్రముగా నుండెను. నవంబరు, డిసెంబరు, జనవరి నెలలలో యీ తీవ్రత మరీ ఎక్కువగా నుండెను. డిసెంబరు నెల రెండవ వారము నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేయుటకు వెళ్ళుచు ప్రధాని నెహ్రూగారు హైద్రాబాదు విచ్చేసి ఒకరోజిచ్చట ఉండిరి ౯వ డిసెంబరు ౬౫ నాడు ఉర్దూహాలుకు ప్రారంభోత్సవము చేయుచు హైదరాబాదులో జవాహర్లాలు నెహ్రూగారు మొదటి నుండియు తాము హైద్రాబాదు విభజనకు వ్యతిరేకులమనియు, అయినను అన్ని రాజకీయ పక్షాలు ఏకగ్రీవముగ కోరినందున, ఫజుల్ ఆలీ కమిషనుకూడ సిఫారసు చేసినందువలన హైద్రాబాదు విభజన అనివార్యమైనదని తెలిపిరి. తమ వ్యక్తిగత అభిప్రాయమేమైనప్పటికిని హైద్రాబాదు విభజన నిర్ణయానికి తాము బద్ధులమైయున్నట్లు ప్రధాని నెహ్రూ తెలిపిరి. ఆనాడు సాయంకాలమున షామంజిల్‌లో జరిగిన కాంగ్రెసు కార్యకర్తల సమావేశములో ముచ్చటించుచు ఆరేండ్లవరకు తెలంగాణమును వేరుగానుంచుట సరిగాదనియు, ఈ ఆరేండ్ల జగడము పెట్టుకొనక ఇప్పుడే ఏదో ఒక తుది నిర్ణయము చేయవలెననియు వర్కింగ్ కమిటీ తనకు సలహా నిచ్చినదనియు స్పష్టీకరించిరి. మరుసటిరోజు నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు శంకుస్థాపన గావించుచు, కృష్ణానదీ జలాలు ఉభయ ప్రాంతాల తెలుగు ప్రజలకు అవిభాజ్యమైన ప్రేమబంధముగా నున్నవని తెలిపిరి. తెల్లవారి గుంటూరులోని రాజకీయ మహాసభలో మాట్లా

దుచు ఆంధ్ర ప్రజల నుద్దేశించి "మీరందరు విశాలాంధ్రను కోరుచున్నా రని నాకు తెలుసును. ఈ కోరిక సంభావ్యము" అని తెలిపిరి. ఈ ఉపన్యాసాలన్నియు ప్రధాని నెహ్రూ విశాలాంధ్రకు వ్యతిరేకులు కారని స్పష్టము చేయుచున్నవి. గుంటూరు రాజకీయ మహాసభలకు ఆంధ్రరాష్ట్ర డిప్యూటీ ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు అధ్యక్షత వహించిరి. ఈ మహా సభలో తక్షణమే విశాలాంధ్రను ఏర్పరచవలెనను తీర్మానము ఏకగ్రీవ ముగ అంగీకరించుట జరిగినది. ఈ తీర్మానమును గుంటూరుకు వెళ్ళి బలపరచిన హైద్రాబాదు కార్యకర్తలలో విశాలాంధ్ర మహాసభ కార్యదర్శి పుల్లారెడ్డిగారు కలరు. సుప్రసిద్ధ ఆంధ్ర నాయకులు, భారత జాతీయ కాంగ్రెసుకు అధ్యక్షులుగా పనిచేసిన మేధావులు, మధ్యప్రదేశ్ గవర్నరు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు 1955 డిసెంబరు నెలలో ఉస్మానియా విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసము నిచ్చుటకు హైద్రా బాదుకు వచ్చిరి. ఆ సందర్భమున వారికి స్వాగతమిచ్చుటకై ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్యాలయ ఆవరణలో ఒక గొప్ప సభ, పరిషత్తు పక్షాన జరిగినది. ఆ సభలో ప్రసంగించుచు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు "అతి త్వరలో మీరు, మేము అను భేదము పోయి జనవరి రెండవ వారములోగా మనము 'మనము' కాగల"మని సెల విచ్చిరి. ప్రప్రథమమున తప్పక విశాలాంధ్ర ఏర్పడగలదను అసందిగ్ధ మైన ప్రకటనగా ఇది భావించబడినది.

### వాదోపవాదాలు-ఢిల్లీ యాత్రలు

జనవరి, ఫిబ్రవరి రెండు నెలలలో విశాలాంధ్ర, తెలంగాణా వాదోప వాదాలు తీవ్రముగా చెలరేగినవి. ఢిల్లీ యాత్రలు అధిక సంఖ్యలో జరిగి నవి. టెలిగ్రాములు అసంఖ్యాకముగ వెళ్ళినవి ఫలాన తేదీన ఢిల్లీ నిర్ణయ

ప్రకటన జరుగగలదని పలుమారులు ఊహింపబడినది. పలుమారులు ఆశా భంగము చెందుటకూడ జరిగినది. ఉభయపక్షాలవారు ఢిల్లీవర్గాలు తమకే అనుకూలముగా నున్నవని పుంఖానుపుంఖముగ ప్రకటనలు కావించుట జరిగినది. ఒక అనిశ్చిత పరిస్థితి ఏర్పడి చాల చీకాకు కల్గించినది. జిల్లాలలో, గ్రామాలలో విశాలాంధ్ర సదస్సులు జరుగుచునే యుండెను. తీర్మానాలపై తీర్మానాలు ఢిల్లీకి పంపబడుచునే యుండెను. ప్రజాభిప్రాయము విశాలాంధ్రకు అనుకూలముగా లేదని ఢిల్లీలోని ఒక రిద్దరు పెద్దలకు, ప్రత్యేకముగ మౌలానా ఆజాద్ గారికి కొన్ని అపోహలు కలవని భావించ బడినది. 1956 జనవరి మూడవ వారములో ఈ అపోహలను తొలగించు ఉద్దేశ్యముతో గౌలీగూడెములోని వివేకవర్ధనీ మైదానమున ఒక బ్రహ్మాండ మైన బహిరంగ సభ జరుపబడినది ఈ సభలో కొన్ని వేలమంది ప్రజలు పాల్గొనిరి సభ దిగ్విజయముగ జరిగినది. సభలో పండిత వినాయకరావు, శ్రీనివాసరావు ఎఖిలేకర్, దేవులపల్లి రామానుజరావు, గురుమూర్తి, కొండా లక్ష్మణ్, కొత్తూరి సీతయ్య, పి. పుల్లారెడ్డి, పండిత నరేంద్రజీ, యమ్.యస్. రాజలింగం, అహమ్మదలీఖాన్ మొదలైనవారు విశాలాంధ్రను బలపరచుచు ప్రసంగించిరి. ఇదేరోజు విశాలాంధ్రను బలపరచుచు కమ్యూ నిస్టు నాయకులు హైద్రాబాదు నగరవీధులలో ఒక పెద్ద ఊరేగింపు తీసిరి. ఊరేగింపులో రెండువేలకు పైగా ప్రజలు పాల్గొనిరి. ఊరేగింపు రావి నారాయణరెడ్డి, దేవులపల్లి వెంకటేశ్వరరావు, బద్దం ఎల్లారెడ్డి, రాజ బహద్దూర్ గౌడు, ముఖ్దూం మొహియొద్దీన్, వి.డి. దేశపాండే ప్రభృతుల నాయకత్వమున నగరమంతటను తిరిగి విశాలాంధ్ర వెంటనే ఏర్పడ వలెనని నినాదాలు కావించినది. ఈ సభ, ఊరేగింపు వలన హైద్రాబాదు నగరము విశాలాంధ్రకు అనుకూలమని ఋజువైనది.

## పార్లమెంట్ లో

1956 జనవరిలో పార్లమెంటు సమావేశము జరిగినది. ఈ పార్ల మెంటు సమావేశములో రాష్ట్రాల పునర్నిర్మాణ సమస్య చర్చకు వచ్చినది. పార్లమెంటు చర్చలను సమగ్రముగ పరిశీలించినప్పుడు అధిక సంఖ్యాకుల అభిప్రాయము విశాలాంధ్రకే అనుకూలముగ నుండినట్లు స్పష్టమైనది. ఆచార్య గోగినేని రంగనాయకులుగారి ఉపన్యాసము కొంత ఆశ్చర్యమును కల్గించినది. వారు కొంతకాలము తెలంగాణము విడిగా నుండవచ్చునని రాజ్యసభలో తెలిపియుండిరి. ఆ రోజులలో ఆంధ్రరాష్ట్రమున విశా లాంధ్రము కావలెనను పట్టుదల లేదని ఢిల్లీలోని ఒకరిద్దరు పెద్దలు తలంచి నట్లు భావించబడినది. ఈ వార్త తెలిసినంతనే ఆంధ్ర రాష్ట్రములోని అన్ని రాజకీయ పక్షాలు వేల సంఖ్యలో విశాలాంధ్రను బలపరచుచు ఢిల్లీ పెద్ద లకు టెలిగ్రాములు పంపిరి. జనవరి తుది వారములో యస్. కె. పాటిల్ గారు హైద్రాబాదుకు వచ్చి రెండు రోజులు రిట్జు హోటలులో మకాము చేసి మూడు నాలుగు ప్రకటనలు కావించిరి. ఈ ప్రకటనలు పరస్పర విరుద్ధముగా నుండి హైద్రాబాదు ఆంధ్ర రాజకీయ వర్గాలలో తీవ్ర అసంతృప్తిని కలిగించినవి. ఆంధ్ర, తెలంగాణాలోని అన్ని వర్గాలవారి ఆమోదముతో విశాలాంధ్ర ఏర్పడవలెనని వారొక ప్రకటనలో తెలిపిరి. దానిపై వ్యాఖ్యానించుచు డాక్టరు చెన్నారెడ్డిగారు ప్రత్యేక తెలంగాణా రాష్ట్రముకన్న తక్కువ యేమియు తమకు సమ్మతము కాదని తెలిపిరి

## ప్రతిష్టంభన

1956 జనవరి నెలలో బొంబాయిపై అఖిల భారత కాంగ్రెసు వర్కింగ్ కమిటీవారి నిర్ణయ ప్రకటన జరిగినది. మహారాష్ట్ర, గుజరాత్, బొంబాయి అను మూడు రాష్ట్రాల ఏర్పాటు జరుగవలెనని వర్కింగ్ కమిటీవారు నిర్ణయించిరి. ఈ నిర్ణయము ప్రకారము బొంబాయి నగ

రము గుజరాతులోగాని, మహారాష్ట్రలోగాని చేరక ప్రత్యేక రాష్ట్రముగ నుండగలదు. బొంబాయి తప్ప కడమ మహారాష్ట్ర ప్రాంతాలన్నియు కలిసి సంయుక్త మహారాష్ట్రముగా రూపొందగలవు. విదర్భ కూడా మహారాష్ట్రలో చేర్చబడినది. ప్రత్యేక విదర్భ రాష్ట్రము ఏర్పడవలెనని వాదించిన బ్రిజలాల్ బియాని ప్రభృతులు వర్కింగ్ కమిటీ నిర్ణయమును సమ్మతించి బలపరచిరి. విదర్భను ప్రత్యేకముగ నుంచుటకు వీలులేదని, దానిని మహారాష్ట్రములో చేర్చవలెనని వర్కింగ్ కమిటీ నిర్ణయించిన తరువాత ప్రత్యేక తెలంగాణా రాష్ట్రమునకు ఇక అవకాశము లేదనియు ఇక విశాలాంధ్రమే ఏర్పడగలదనియు గాఢ విశ్వాసము రాజకీయ వర్గాలలో కలిగినది. బొంబాయిపై వర్కింగ్ కమిటీ చేసిన నిర్ణయముపై ఆ నగరమున శాంతిభంగమైన ఘోర దౌర్జన్యాలు జరిగినవి. ఈ దౌర్జన్యాలు దేశమున సంచలనము కలుగచేసినవి ఒరిస్సా, బీహారు రాష్ట్రాలలో గూడ దౌర్జన్యకాండ జరిగినది. ఈ సంఘటనపై ఆలోచించుటకు, ఇతర సమస్యలను గూర్చి నిర్ణయించుటకు ముఖ్యమంత్రుల సమావేశము, కాంగ్రెసు అగ్రనాయకుల సమావేశము జరిగినది. సరిహద్దులు మొదలైన సమస్యలపై సంఘర్షణలు జరిగి దౌర్జన్యమునకు దారి తీయుట కాంగ్రెసు అగ్రనాయకులకు ఆవేదన కల్గించినది. అపుడు చిన్న రాష్ట్రాల ఏర్పాటు సమంజసము కాదనియు, పెద్ద రాష్ట్రాలు ఏర్పడుట అవసరమనియు, అంతేకాక ద్విభాషా రాష్ట్రాలు, బహుభాషా రాష్ట్రాలు ఏర్పడుట సమంజసమనియు కాంగ్రెసు అగ్రనాయకులకు ఒక ఆలోచన కలిగినది. ఢిల్లీలో జనవరి తుది వారమున ముఖ్యమంత్రుల సమావేశ సందర్భమున కలుసుకొన్న బెంగాలు, బీహారు ముఖ్యమంత్రులైన బి. సి. రాయ్, శ్రీ కృష్ణ సిన్హాగారలు బెంగాలు, బీహారులు లీనమగుటకు ఒప్పుకొనిరి. వర్కింగ్ కమిటీవారు దీనిని హర్షించిరి. దీనిపైన దేశములో భాషా రాష్ట్రాల ఏర్పాటు వెనుకపడునేమో అను అనుమానము కలిగినది, బెంగాలు, బీహారు

రాష్ట్రాల విలీనీకరణకు ఉభయ రాష్ట్రాలలో తీవ్ర ప్రతిఘటన వచ్చినది. దేశ మందంతటను ముఖ్యులైనవారు ద్విభాషా రాష్ట్రాల ఏర్పాటుపై ప్రకటనలు చేయుట ఆరంభించిరి. హైదరాబాదు ముఖ్యమంత్రి డాక్టరు బూర్గుల రామకృష్ణారావుగారు ఆంధ్ర, కర్ణాటక రాష్ట్రాలు కలిసి ఏక రాష్ట్రముగ ఏర్పడవలెనని సూచించిరి ఆంధ్ర ముఖ్యమంత్రి బెజవాడ గోపాలరెడ్డి గారు ఆంధ్ర, మహారాష్ట్రములు కలిసి ఏక రాష్ట్రముగ ఏర్పడవలెనని సలహా నిచ్చిరి. అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు ఒరిస్సాతో ఆంధ్ర ప్రాంతములను కలిపిన బాగుండునేమోయని సెలవిచ్చిరి. చెన్నా రెడ్డిగారు ఆంధ్ర, తెలంగాణా, కర్ణాటక ప్రాంతాలను ఏక రాష్ట్రముగ చేసిన బాగుండునని వెల్లడించిరి. కొండా వెంకట రంగారెడ్డి గారు ఈ సమస్యపై ఏమియు వెంటనే చెప్పుటకు వీలులేదనియు, జాగ్రత్తగా ఆలోచించవలసి యున్నదనియు ప్రకటించిరి. మొట్ట మొదట విశాలాంధ్రము ఏర్పడుట అవసరమనియు. కడమ సంగతులు తరువాత ఆలోచించుకొన వచ్చుననియు అసందిగ్ధముగ సంజీవరెడ్డిగారు ప్రకటించిరి ద్విభాషారాష్ట్రముల ప్రతిపాదనను విశాలాంధ్ర వాదులు హర్షించలేదు భాషాసూత్రము పైన రాష్ట్రాలు ఏర్పాటు కావలెనని వీరు అభిప్రాయపడిరి. ఈ విషయమై సుదీర్ఘమైన ప్రకటన కావించుచు దేవులపల్లి రామానుజరావు భాషా రాష్ట్ర ప్రతిపాదికమీదనే భాషారాష్ట్రాలు ఏర్పడవలెనని ప్రకటించుట జరిగినది. గోలకొండ పత్రిక ఈ సందర్భమున ఒక చక్కని సంపాదకీయమును వ్రాసినది. ఆ సంపాదకీయములో భాషారాష్ట్ర ప్రతిపాదికను బలపరచి, ఏకభాషా రాష్ట్రాలు కావలెనని ఉద్ఘాటించుట జరిగినది.

**శుభాంతము**

జనవరి నెలలో కేంద్ర ప్రభుత్వములోని ముఖ్యులైనవారు కొందరు హైద్రాబాదు నగరమునకు విచ్చేసిరి. రక్షణ శాఖామంత్రి

డాక్టరు కైలాసనాధ్ కట్జూ, రైల్వేశమంత్రి లాల్‌బహద్దూర్‌శాస్త్రి,విదేశాంగ వ్యవహారశాఖలో మంత్రిగానున్న డాక్టర్ సయ్యద్ మహమూద్ ఇట్లు హైద్రాబాదుకు వచ్చినవారిలో ముఖ్యులు. వీరందరిని విశాలాంధ్ర మహాసభ పక్షాన విశాలాంధ్ర మహాసభ ప్రతినిధులు ఆహమ్మదలీఖాన్, కొత్తూరి సీతయ్య, పుల్లారెడ్డి, దేవులపల్లి రామానుజరావు, ఎల్లం సత్యనారాయణ, పండిత నరేంద్రజీ, సర్దారుల్లాఖాన్, ధరణీధర సంఘీ, అబిదలీఖాన్ మొదలైనవారు కలుసుకొని, తక్షణ విశాలాంధ్ర స్థాపనావశ్యకతను నిరూపించుట జరిగినది. విశాలాంధ్రోద్యమానికి రామకృష్ణారావుగారు నాయకత్వము వహించిరి. ప్రత్యేక తెలంగాణా ఉద్యమానికి రంగారెడ్డిగారు నాయకులైరి. ఫిబ్రవరి రెండవవారములో అఖిల భారత కాంగ్రెసు జాతీయ మహాసభ అమృతసర్‌లో జరిగినది ఈ సమావేశానికి హైదరాబాదులోని ఉభయపక్షాల ప్రతినిధులు వెళ్ళిరి. కాంగ్రెసు అగ్రనాయకుల నిర్ణయము ప్రకారము దేశములో పెద్ద రాష్ట్రాల నిర్మాణము కావలెనను భావము కాంగ్రెసు వర్గాలలో క్రమక్రమముగా బలపడసాగినది. హైదరాబాదు నాయకులను ఢిల్లీకి పిలిచి పెద్ద రాష్ట్రాల నిర్మాణావశ్యకతను తెలుపుట జరిగినది. రక్షణలతో తెలంగాణమును ఆంధ్ర ప్రాంతములో లీనము చేయుట సమంజసమని నిర్ణయించబడినది. తెలంగాణా వారికి ఉద్యోగాలలోనూ విద్యా వైద్యాభివృద్ధి ప్రణాళికలోను తగిన రక్షణలనిచ్చి, ఆ రక్షణల కాపాడుటకు ఒక ప్రాంతీయ కౌన్సిలును ఏర్పాటు చేయుటకు నిర్ణయం జరిగినది. ఈ వివరాలలో ముఖ్యమైన వానిని పార్లమెంటు చట్టములో పొందుపర్చుట జరిగినది. రక్షణలకు ఎవరు, ఎన్నడును వ్యతిరేకులు కారు. మొదటినుండియు తెలంగాణమునకు తగిన రక్షణలతో విశాలాంధ్రము ఏర్పడవలెనని విశాలాంధ్రవాదుల అభిప్రాయమై యుండెను. విశాలాంధ్ర మహాసభ పక్షాన ఫజుల్‌అలీ కమీషను కిచ్చిన

నివేదికలో తెలంగాణాకు రక్షణల ఆవశ్యకతను ఉద్ఘాటించుట జరిగినది. కమీషను నివేదిక ప్రకటనకు ముందుగను తరువాతను చెన్నారెడ్డి గారు మాత్రము రక్షణలకు ఏమంత ప్రాధాన్యము లేదనియు, దాని ఆవశ్యకత అంతగా లేదనియు చెప్పుట జరిగినది. మొత్తము మీద ఈ వ్యవహారము శుభాంతముగ పరిణమించినది. ఆంధ్ర నాయకులు తెలంగాణమునకు "బ్లాంక్ చెక్" ఇచ్చుటకు సిద్ధముగా నున్నట్లు ప్రకటన గావించిరి. ఇక విశాలాంధ్ర ప్రకటన మాత్రము జరుగవలసి యుండెను. ఆ ప్రకటన మార్చి మొదటి వారములో నిజామాబాదు పట్టణమున భారత సేవక సమాజ్ వార్షికోత్సవాలకు అధ్యక్షత వహించిన భారతదేశము యొక్క ఉదాత్త సంస్కృతికి ఉత్తమ చిహ్నము, భారత ప్రజలకే కాక సకల ప్రపంచ ప్రజలకు ప్రేమాస్పదుడైన నాయకుడునైన జవహర్లాలు నెహ్రూ చేయుట జరిగినది. ఈ ప్రకటనను హైదరాబాదు, ఆంధ్రరాష్ట్రములోని అన్ని వర్గాలు హర్షించి, సంపూర్ణముగ సమర్థించుట జరిగినది. పెద్దలైన కొండా వెంకట రంగారెడ్డి నెహ్రూగారు ప్రకటించిన భారత ప్రభుత్వ నిర్ణయము హైద్రాబాదులోని ప్రజలందరు శిరసావహించవలసినదని ప్రకటించిరి. ఈ విధముగ మూడుకోట్ల తెలుగు ప్రజలమధ్య కృత్రిమముగ నూట ఏబది సంవత్సరాలు ఏర్పడిన అఖాతము తొలగిపోయినది; విశాలాంధ్రము వచ్చినది.

**మహోజ్జ్వల ఘట్టము**

1946 నుండి 1956 వరకు హైద్రాబాదు రాజకీయ చరిత్రలో మహోజ్జ్వలమైన ఘట్టము. 1946కు ముందు హైద్రాబాదులో ప్రజాస్వామ్య వ్యతిరేకమైన మధ్యకాలపు నిరంకుశ రాజరికము అధికారములో నుండెను. ఈ ప్రభుత్వమును తొలగించి ప్రజాస్వామిక ప్రభుత్వమును స్థాపించుటకు 1946 సంవత్సరమునకు చాలాకాలము ముందునుండియే

ప్రజల ఉద్యమాలు బయలుదేరి పనిచేయుచుండెను. 1946 తరువాత కాంగ్రెసు ఉద్యమము బాధ్యతాయుత పరిపాలన ఆదర్శముతో విజృంభించి పనిచేయసాగింది 1948 లో పోలీసుచర్య జరిగినది. తరువాత హైదరాబాదు విభజనోద్యమము బయలుదేరినది 1952 లో ఎన్నికలు జరిగి, బాధ్యతా యుత ప్రభుత్వము ఏర్పడినది అప్పుడు విభజనోద్యమము మరింత బలపడినది విశాలాంధ్ర, సంయుక్త మహారాష్ట్ర, ఐక్య కర్ణాటక ఉద్య మాలు తీవ్రముగ ప్రారంభమయి, 1956లో విజయవంతముగ ముగిసినవి. ఈ విధముగ 1946 నుండి 1956 వరకు ఒక దశాబ్దమున కొన్ని శతాబ్దములలో జరుగనటువంటి మహోజ్జ్వలమైన చరిత్ర నిర్మాణము జరిగినది. ఆంధ్రదేశ చరిత్రలోనే ఇది అద్వితీయమైన ఘట్టము.

**నోటు** :- ఆంధ్ర-తెలంగాణంతో కూడిన రాష్ట్రమునకు ఆంధ్రప్రదేశ్ అను పేరుపెట్టవలెనని ఆంధ్ర శాసన సభ, హైద్రాబాదు శాసన సభ (దుర్ముఖి ఉగాదినాడు) నిర్ణయించినవి.

